# దేశదేశాల జానపద కథలు



పబ్లికేషన్స్ డివిజన్
మినిస్ట్రీ ఆఫ్ ఇన్ఫర్మేషన్ అండ్ బ్రాడ్‌కాస్టింగ్
గవర్నమెంట్ ఆఫ్ ఇండియా.

# కథాకారుల పరిచయం

1. **మన్మథనాథ గుప్త:-** బహు గ్రంథకర్త. బెంగాలీ జానపద కథలు, రంగమంచ్, బాలకథాకహాని, ఫ్రెంచిజానపద కథలు, దేశదేశాల కథలు, ఈయన రచనలు. ఆఖరి పుస్తకం ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం బహుమతి పొందింది. కథా రచనలలో అనేక సార్లు బహుమతి పొందాడు. "బాలభారతి"కి మాజీ సంపాదకుడు.
2. **సావిత్రీదేవి వర్మా:-** ఈమెకు బాలల మనోవిజ్ఞానం అభిమాన విషయం. "మీబిడ్డ" ఈ విషయంలో ఉత్తమ గ్రంథం. బాలభారతి, జంగల్‌జ్యోతి, షేక్స్పియర్ కథలు, బాల పంచతంత్రం, ఉత్తర ప్రదేశపు జానపద కథలు ఆమె రచనలు. ప్రస్తుతం పబ్లికేషన్ డివిజనులో పని. జానపద కథల సేకరణ సాగిస్తున్నారు.
3. **అవనీంద్రకుమార్:-** హిందీలో ప్రసిద్ధలేఖకుడు, సంపాదకుడు.
4. **టోమోజీ మూతో:-** జపాను దేశస్థుడు. హిందీలో వ్రాస్తుంటాడు.
5. **మహాదేవ కరమార్కర్:-** హిందీలో వర్ధిష్ణులేఖకుడు.
6. **బ్లదీమీర్ మిల్తనేర్:-** జకోస్లవేకియా జావపదకథలు హిందీలో వ్రాస్తుంటాడు.
7. **గీతాకృష్ణాత్రీ:-** ఈమె తన భర్తవెంట తిబ్బెత్తు వెళ్ళింది. అక్కడి జానపద కథలు రెండు పంపింది.
8. **ద్రోణవీర్:-** ఇతడు పంజాబీ. అయినా హిందీలో వ్రాస్తుంటాడు.
9. **నీరా సక్సేనా:-** హిందీ రచయితల్లో వర్ధిష్ణువు.
10. **సూర్యభాను 'కపిల్':-** హిందీ రచయిత.
11. **గేండారామ్ సుగంధ:-** తరచుగా బాలభారతికి కథలుపంపుతుంటాడు.
12. **మోహన్‌సింగ్ సామంత్:-** హిందీలో వర్ధిష్ణురచయిత.
13. **సరోజ హరిభూషణ్:-** హిందీ రచయిత.

# విషయసూచిక

| | | పుట |
|---|---|---|
| బంగారపు మేక | మన్మథనాథగుప్త | ౬ |
| బంగారు చేప | సావిత్రీదేవి వర్మా | ౧౬ |
| పితృవాక్య పాలనం | అవనీంద్ర కుమార్ | ౨౬ |
| సాగరజలం ఉప్పగా....? | టోమోజీ మూతో | ౩౩ |
| కోడిగ్రుడ్లు | మహాదేవ కర్మార్కర్ | ౩౭ |
| అడవిరాజ్యం | సావిత్రీదేవి వర్మా | ౪౪ |
| పోపెల్కా | బ్లదీమీర్ మిల్తనేర్ | ౫౨ |
| దుష్టసేవకురాలు | గీతాకృష్ణాశ్రీ | ౫౭ |
| శిల్పికొడుకు | ద్రోణవీర్ | ౬౬ |
| వరాలనిచ్చు శునకము | గీతాకృష్ణాశ్రీ | ౬౩ |
| ఒక్కడే దేవుడు | వీరా సక్సేనా | ౬౯ |
| గుంటనక్కతోక తెలుపు ఎందుకయింది? | మన్మథనాథ గుప్త | ౭౨ |
| పన్నెండుగురు సోదరులు | సూర్యభాను 'కపిల' | ౭౭ |
| యుక్తిగల రైతు | గెండారామ్ సుగంధ్ | ౯౫ |
| సూర్యుణ్ణి వెదకడం | మోహన్‌సింగ్ సామంత్ | ౯౭ |
| సోనియా, పన్నెండు మాసాలు | సరోజ హరిభూషణ్ | ౧౦౫ |

<u>తుర్కీ-కథ:</u>

# బంగారపు వేంక

మన్మథనాథగుప్త

పూర్వకాలంలో ఒక రాజు వుండేవాడు. అతనికి ఒక కూతురు కలదు, కుందనంలాంటి శరీరము, ఎఱ్ఱని వుంగరాల జుట్టు, నల్లని తుమ్మెదల్లాంటి కళ్లు, గులాబీ పూవులను బోలిన బుగ్గలతో ఆమె అందము ఇంత అంత అని చెప్పనలవిగానిది. చూచినవారందరూ ఆమెను ప్రేమిస్తుండేవారు. నిజానికి ఆ అమ్మాయి కొరకు ఎందరెందరో రాజకుమారులు వచ్చారు. కాని ఆ అమ్మాయి వద్ద కాపలావుండే దాసీది ఎవర్నీ దగ్గరకు రానిచ్చేది కాదు. అందుచేత ఆ అమ్మాయి పెండ్లి కాకుండానే వున్నది.

ఒకనాడు దాసీదానికి ఒక ఆలోచన తట్టింది. వెంటనే రాజువద్దకు వెళ్ళి- "ఓ రాజా! మన అమ్మాయిని పెండ్లాడవలెనని అనేకమంది రాజకుమారులు వస్తున్నారు. వారిలో ఎవర్ని కాదనాలో, ఎవర్ని ఔననాలో కూడా తెలియడం లేదు. ఈ చిక్కు లేకుండా చేసుకోవాలంటే నాకు ఒక ఉపాయం తోస్తున్నది. అది తమకు విన్నవించదలచుకున్నాను" అన్నది.

రాజు- "నేనూ ఇదే ఆలోచిస్తున్నాను. నీ ఆలోచన ఏమిటో చెప్పు?" అన్నాడు.

దాసి- "భూమిక్రింద మనము ఓ చక్కని మేడ కట్టించాలి. ఆ మేడనుంచి ఉద్యానవనంలోకి మెట్లు కట్టించాలి. మెట్ల చివరభాగాన మేడకు మాయద్వారం అమర్చాలి. ఎవరికీ తెలియకుండా మన అమ్మాయిని ఆ మేడలో వుండాలి. తరువాత అమ్మాయిని పెండ్లాడడానికి వచ్చిన ప్రతివారికి మూడుదినాలు గడువు ఇచ్చి, రాజకుమార్తెను కనుక్కోమనాలి. అలా కనుక్కున్న వారికే అమ్మాయి నిచ్చి పెండ్లిచేయాలి. కనుక్కోలేని వారి తల నరికించి కోట ద్వారానికి వ్రేలాడగట్టాలి" అని విన్నవించింది. రాజుగారికి ఆ ఉపాయం చక్కగా నచ్చింది. సరేనన్నాడు. రాజుగారికి తన వుపాయం నచ్చినందుకు దాసీది ఎంతో సంతోషించింది.

మరునాడు రాజుగారి హుకుం అయింది. అనుకున్న ప్రకారం భూగర్భంలో మయనిర్మితంలాంటి మేడ తయారయింది. దానికి మాయలద్వారం అమర్చబడింది. ఉద్యానవనం వరకూ మెట్లు కట్టబడ్డాయి. ఎవరూ చూడకుండా రాజకుమారిని ఆ మేడలో ప్రవేశపెట్టారు. రోజూ అనేకమంది రాజకుమారులు వస్తున్నారు. అందరికీ మూడు దినాలు గడువిచ్చి- "ఈ మూడుదినాల గడువులోపల రాజకుమార్తెను కనుక్కున్న వారికే రాజకుమారినిచ్చి పెండ్లిచేయబడును, అలా కనుక్కొనలేని వారిని ఆఖరిదినం తల నరికి, ఆ తల కోటగుమ్మానికి వ్రేలాడ వేయబడును" అని తెలియజేయబడింది. అనుకున్న ప్రకారమే అనేకమంది రాజకుమార్లు వస్తున్నారు. షరతుల ప్రకారం సాయశక్తులా ప్రయత్నించి వోడిపోతున్నారు. వారి తలలు నరికివేయబడుతున్నాయి. ఇదంతా తన వుపాయం ప్రకారమే జరుగుతున్నందుకు దాసీ సంతోషం పట్టలేకపోతున్నది. దానిది అంత క్రూర స్వభావం.

ఇలావుండగా కొంతకాలానికి ఆవార్త ప్రక్కరాజ్యంలోకి పాకిపోయింది. అక్కడి రాజుకి ముగ్గురు కొడుకులున్నారు. ఒకనాడు పెద్దకొడుకు తండ్రి వద్దకువచ్చి "నాన్నా! నాన్నా!! మన ప్రక్కరాజ్యంలో భూగర్భంలో దాగివున్న రాజకుమార్తెను నేను వరించాను. ఆమెను వెదకితెస్తాను, పెండ్లాడతాను" అన్నాడు.

తండ్రి కొడుకును వెళ్ళవద్దని, వెడితే మోసపోతావని, ఎంతో నచ్చజెప్పాడు. కాని కొడుకు వినలేదు. అన్నింటికీ ససేమిరా అని తప్పక వెడతానని పట్టుబట్టాడు. కడకు రాజు కొడుకు కోరికప్రకారం చాలినంతధనం, చక్కని గుఱ్ఱం, ఇచ్చి పెద్ద అట్టహాసంగా కొంతదూరం సాగనంపాడు. తరువాత తిరిగి ఇల్లు చేరాడు.

రాజకుమారుడు రాజకుమార్తె తండ్రివద్దకు వెళ్ళి- "ఓ రాజా! తమ షరతుల ప్రకారం తమ కుమార్తెను వెదకి తెస్తాను. ఆమెను పెళ్ళాడతాను" అన్నాడు.

రాజు అతనికి ఈ విధముగా నచ్చ జెప్పాడు- "అబ్బాయీ! నీవు చాలా చిన్నవాడవు. నాలుగు దినాలు బ్రతకదగిన వాడవు. ఈ కోరిక విడిచిపెట్టు. లోకంలో ఎంతమంది రాజకుమార్తెలులేరు ? ఒకరిని మించినవారు ఒకరుగా అందగత్తెలు వున్నారు. వారినెవరినైన పెండ్లాడు. ఇక్కడ నా కుమార్తెను ఎవరికి తెలియనిచోట దాచి వుంచారు. మూడు దినాల లోపల ఆమెను కనుక్కో-వాలి. లేని యెడల ఆఖరిదినం సాయంత్రం నీ తల కొట్టివేయ బడుతుంది. తెలుసా?"

రాజకుమారుడు ఈ విధముగా జవాబిచ్చాడు - "పుట్టినవారికి గిట్టుట తప్పదు. ఇది లోకధర్మము. ఇంతకూ నా అదృష్టము పండినదా, రాజకుమారి దొరుకుతుంది. లేదా, నాకు చావు వుండనే వున్నది. దీనికి భయమెందుకు? నా నిర్ణయం వదల దలచుకోలేదు."

ఆఖరికి రాజు అనుమతి ఇచ్చాడు. రాజకుమారుడు ఆ దినం విశ్రమించి, రెండవదినం రాజకుమార్తెను వెదకడం ఆరంభించాడు. వెదకి వెదకి వేసారి పోయాడు. గడువు పూర్తి అయింది. షరతు ప్రకారం అతని తల నరికి వేశారు. అనేక తలల్లో అది ఒక తల అయింది.

ఎంత కాలానికీ పెద్ద రాజకుమారుడు రాకపోవడం చూచి, రెండవ రాజకుమారుడు తండ్రి వద్దకు వచ్చి "నానా్న! అన్నను వెదక వెళ్ళుతాను" అన్నాడు.

రాజు - "నాయనా ! నీ అన్న తల ఈపాటికి నరికివేసి వుంటారు. వారి షరతుల ప్రకారం తాను నెగ్గివుండిన ఈపాటికి ఆ శుభవార్త వచ్చివుండేది" అన్నాడు.

రాజకుమారుడు - "అన్నయ్య వెళ్లిన పనిమీదనే నేనూ వెడతాను." అన్నాడు.

రాజు తన కుమారుని వెళ్ళవద్దని బోధించాడు. కాని కొడుకు వినలేదు. ఆఖరికి రాజు అతనికికూడా చాలినంత ధనం, చక్కని గుఱ్ఱం ఇచ్చి, వైభవంగా సాగనంపాడు. రాజకుమారుడు రాజకుమారితండ్రిని చేరి, వారి షరతుల ప్రకారం అనుమతి పొందాడు. మూడుదినాల వరకు యత్నించి, కడకు విఫలుడయినాడు. ప్రాణదండన పొందాడు.

రెండో రాజకుమారుడుకూడా ఎంతకాలానికీ రాకపోవడం చూచి,మూడవ కుమారుడు తన తండ్రి అనుమతి మీద రాజకుమారి వుండే చోటికి పయనమయి నాడు. దారిలో ఒక పట్టణంలో కంసాలి వద్దకు వెళ్ళి, అతనికి రెండు మణుగుల బంగారం ఇచ్చి - "దీనితో ఒక చక్కని మేకనుచేయి; నేను ఆ మేక కడుపులో యిమిడేటంత పెద్దదిగా చేయాలి సుమా ! మిగతా బంగారము నీది" అన్నాడు.

కంసాలికి అంతులేని ఆనందం కలిగింది. వెంటనే పని అరంభించాడు తెల్లవారి పొద్దుపొడిచేసరికల్లా మేక తయారయిపోయినది. రాజకుమారుడు కూడా అతని పనితనానికి మెచ్చుకుని - "సెబాష్ కంసాలీ ! బాగాచేశావు గాని, ఈ మేకను ఫలాని రాజుగారింటికి చేర్పించాలి" అన్నాడు.

రాజకుమారుడు బంగారపు మేక కడుపులో దాగి కూచున్నాడు. కంసాలి మేకను కూలీలతో రాజుగారి ఇంటికి చేర్పించాడు. వెంటనే "ఎవరో రాజకుమార్తెకు బహుమతి చేయడానికి చక్కని బంగారపు మేకను తెచ్చారు"ని రాజుకు కబురు చేయబడింది. ఎవరికీ తెలియకుండా భూగర్భంలో దాచివుంచిన రాజకుమార్తె వినోదం కొరకు కొన్ని వస్తువులు అవసరమే కదా ! అందుకు ఈ బంగారపు మేక మరీ బాగుంటుందని తలచి రాజు విశ్వాసపాత్రు లయిన భటులను పిలిచి, ఆ సువర్ణ మేకను రాజకుమార్తెకు యిచ్చి రమ్మని ఆజ్ఞాపించాడు. భటులు అలానే చేర్పించారు. రాజకుమారి ఆనందంతో ఆ మేకను ఒకమూల భద్రపరచుకున్నది. ఈ లోపల రాజకుమారుడు మేక కడుపులోనుండి రాజకుమారిని చూచాడు. అతడు ఆమె అందానికి లోలోపల ఆశ్చర్యచకితుడైనాడు.

మేక కడుపులో వున్న రాజకుమారునికి క్రమంగా ఆకలి కాసాగినది. రోజూ రాత్రిపూట రాజకుమార్తెకు అన్నం వస్తుండేది. రాజకుమారుడు ఏదో విధముగా సందుచేసుకొని, అందులో సగం అన్నం తినేస్తుండేవాడు. ఇలా కొన్ని దినాలు గడిచాయి. " ఇదివరకు నాకు సరిపోయే అన్నం కొన్ని దినాల నుంచి తక్కువ అవుతున్న కారణం ఏమిటో?" అని రాజకుమారికి సందేహం కలిగింది. కావలా భటులు తినేస్తున్నారు కాబోలునని కూడా అనుమానపడినది.



రాజకుమార్తెకు బహుమతిచేయడానికి చక్కని
బంగారు మేక తీసుకురాబడిందని రాజుకు
తెలియపర్చబడింది.

సరే. కారణం కనుక్కోవాలనని ఒక దినం పొంచి కూర్చున్నది. బంగారు మేక కడుపులోవున్న రాజకుమారునికి ఇది తెలియదు.చీకటి పడడంతోనే మామూలుగా అన్నం వచ్చింది. వెంటనే రాజకుమారుడు బైటకు వచ్చి, సగం అన్నం తిని, యథాప్రకారం మేక కడుపులో ప్రవేశించ బోతుండగా రాజకుమారి వెంటనే అగ్గిపుల్ల గీచి చూచినది. ఆ వెలుతురులో ఒకరి నొకరు చూచుకున్నారు. ఒకరి అందానికి ఒకరు మోహితులయి, కొంతసేపటి వరకు ఎవరూ మాట్లాడ లేక పోయారు. ఆఖరికి రాజకుమారి "ఎవరు నీవు?" అని ప్రశ్న వేసింది.

రాజకుమారుడు "నేను రాజకుమారుణ్ణి. మా అన్నలు ఇద్దరు నీకోసం ప్రాణాలర్పించుకున్నారు. కాబట్టి నీకొరకు ఈ వుపాయముతో వచ్చాను" అన్నాడు.

దాసీదాని కట్టడిలో వుండి వుండి రాజకుమారి విసుగుచెందింది అందువల్ల వారిద్దరూ కలిసి - "పగలు బంగారు మేక కడుపులో వుండవలెనని రాత్రి చక్కగా మాట్లాడుకోవాలని" నిర్ణయం చేసుకున్నారు. ఇదే విధముగా కొన్ని దినాలు గడిచిపోయాయి. ఎంతకాల మిట్లా వుండగలరు? ఒకదినం రాజ కుమారి రాజకుమారునితో- "ఎంతకాలము మనము దొంగజీవితం జీవించగలము. ఏవిధముగనైనా ఈ బంధనములనుండి ముక్తి పొందు మార్గము వెదకాలి"! అన్నది.

దానికి రాజకుమారుడు "ఈ బంగారు మేక కాలు ఒకటి విరగగొడతాను, దానిని బాగుచేయించమని మీ తండ్రి వద్దకు పంపించు. దీనిద్వార నేను బైటకు వెడతాను. తిరిగి మరల నీవద్దకు వస్తాను. ఇదొక్కటే వుపాయము అన్నాడు."

బైటకు వెళ్ళిన రాజకుమారుడు తిరిగి యెట్లా రాగలడు? అన్న సంగతి రాజకుమారి ఆలోచించలేదు. కాని అతనిమీద ఆమెకు గట్టి నమ్మకం కలిగింది. అందుచేత ఆమె రాజకుమారుని యుక్తికి అంగీకరించింది.

అనుకున్న ప్రకారం సంగతి తెలియపరచబడి, బంగారుమేక రాజువద్దకు పంపబడినది. అక్కడినుంచి దాన్ని చేసిన కంసాలి వద్దకు పంపబడింది.

కంసాలికి అంతా తెలిసినసంగతే గాబట్టి, రాజకుమారుడు మేకలోనుంచి బైట కొచ్చాడు. తరువాత వెంటనే రాజుగారివద్దకు వచ్చి - "ఓ రాజా! తమ కుమార్తెను పెండ్లాడదలచుకుని వచ్చాను" అన్నాడు.

రాజుగారు మామూలు ప్రకారముగా రాజకుమారునికి ఈకోరిక వీడమని ఎన్నోసార్లు బోధించాడు. ముందుగానే రాజుగార్ని తనబుట్టలో వేసుకున్న రాజకుమారునికి రాజు వుపదేశాలు పనిచేయలేదు. అతడుపట్టినపట్టు వీడనన్నాడు. రాజు అతని కోరికకు అంగీకరించక తప్పిందికాదు. రాజభటులను రప్పించి ఈ కుమారుని వారికప్పగించాడు. రాజకుమార్తెను కనుక్కునే కిటుకులు అన్నీ తెలిసినవాడుగాన రెండు దినాలు ఇటు అటు వెదికినట్లు నటించి, మూడవరోజు రాజువద్దకువచ్చి- "ఓ మహారాజా! నేనింకా వెదకవచ్చునా?" అన్నాడు.

'ఇతడు చేతినుండి జారిపోడుగదా' అని ప్రక్కనున్న దాసీదానిగుండెలో అదటు పుట్టింది. ఇతని తలకూడ నరికించి, అనేక తలల్లో దీన్ని కూడా చేర్చాలని దానికోరిక.

రాజు- "ఆ! సాయంత్రం వరకు వెదకవచ్చు. షరతు మాత్రం మరవలేదు గదా? సాయంత్రానికి వెదకలేనియెడల నీతల ఎగిరిపోగలదు సుమా?" అన్నాడు.

రాజకుమారుడు - "ఆ! ఎరుగుదును. కాని ఒక్కమాట - తమ మేడను చేరివున్న సరోవరంలోని నీరు తోడించి ఖాళీచేయించగలరని ప్రార్థన."

రాజుకు తప్పిందికాదు. తన భటులను పిలిపించి పొద్దుకూకేసరికి సరోవరం ఖాళీచేయించాడు. సరోవరం ఖాళీగావడంతోనే భూగర్భంలో వున్న మేడ ద్వారం కనుపించ సాగింది. రాజకుమారుడు దాన్నిచూపి 'ఈద్వారం తెరవాలి' అన్నాడు.

దగ్గరున్న దాసీదానికి సగంప్రాణం ఎగిరి పోయింది. ఆ ద్వారం తాళాలు తనవద్దనే వున్నాయి. ఏమిచేస్తుంది? ఇవ్వక తప్పింది కాదు. అయినా దాసి మరొక ఎత్తు వేసింది. "ఆ! తెరవడానికేం? తెరుస్తాను. కాని నేను లోపలికి వెళ్లి పిలుస్తాను. అంతవరకు ఇక్కడే రెండునిమిషాలు నిలబడు." అంది.



నిజమైన చెలికత్తెలు వరహాలమీద విరుచుకుపడ్డారు.

రాజకుమారుడు సరే నన్నాడు. దాసీది లోపలకువెళ్ళి తొందరతొందరగా రాజకుమార్తెకు రాణిగారి చెలికత్తెల దుస్తులు తొడిగి, చెలికత్తెలమధ్య నిలబెట్టినది. తరువాత రాజకుమారుని పిలిచి 'రాజకుమారిని గుర్తించు'' అన్నది.

కొన్నిదినాలు రాజకుమారితో కలిసివుంటూ, ఆమెను చక్కగా ఎరిగిన వాడై కూడా రాజకుమారుడు కాస్త తబ్బిబ్బులు పడసాగాడు. రాజకుమారిని గుర్తించలేకపోయాడు. అయినా అతడు యుక్తిపరుడు అవడంచేత ఎత్తుకు పైఎత్తు వేశాడు. తన వద్దనున్న వరహాలు ఒక్కసారిగా చెలికత్తెలముందు వెదజల్లివేశాడు. పేదవారికి ఆశఎక్కువన్నట్లు, నిజమైన చెలికత్తెలు ఒక్కసారిగా వాటిమీద విరుచుకుపడి వరహాలు పోగుచేసుకుంటున్నారు. రాజకుమారి నిలచినచోటునుంచి కదలలేదు. రాజకుమారుడు "అదిగో రాజకుమారి" అని వెంటనే చెయ్యి పట్టుకుని రాజువద్దకు తీసుకువెళ్ళాడు.



రాజకుమారునికి, రాజకుమార్తెకు వైభవంగా వివాహం జరిగింది.

అదిచూచి రాజు సంతోష పూర్వకముగా ఆశీర్వదించి రాజకుమారికి రాజకుమారునికి వైభవోపేతముగా వివాహము చేసినాడు.

తరువాత కసాయివాని చేత దుర్మార్గురాలు దాసిదాని తల కొట్టించి, ఆ అనేక తలలకు మరొకటి కలిపారు.

ఏడు రాత్రుళ్లు ఏడు పగళ్ళు రెండు రాజ్యాల ప్రజలు పండుగలు, ఉత్సవాలు చేసుకున్నారు. రాజకుమారి, రాజకుమారైె సుఖంగా జీవిస్తున్నారు.

ం)————(ం

రష్యా దేశపు కథ

# బంగారు చేప

సావిత్రీదేవి వర్మ

రష్యాదేశంలో ఒక పల్లెవాడు ఉండేవాడు. చాలా పేదవాడు. సముద్ర తీరాన ఎత్తుగా అతని పూరిల్లు వుండేది. చేపలుపటడం, అమ్మడం, అదే అతని పని.

పాపం ఆ ముసలాడు ఎంతోమంచివాడు, అమాయకుడు, అల్పసంతోషి. కాని అతని ముసలిభార్య మాత్రం గయ్యాళిగంప, పరమలోభి, చిరాకుమనిషి. లోకంలో కొందరి స్వభావాలు అలాగే వుంటాయి. కలిగినదానితో సంతోషించరు. ఎప్పుడు చూచినా ఇంట్లో అదిలేదు, ఇదిలేదు అని గొణుగుతుంటారు. ఆ ముసలిదానిదికూడా అలాంటి స్వభావమే. ముసలిభర్త పొద్దస్తమానం తిండితిప్పలు లేకుండా సముద్రతీరాన ఎండకీ, గాలికీ ఓర్చుకొని సాయంత్రం మోయలేనన్ని చేపలు తెచ్చేవాడు. అలసిసొలసి వచ్చిన ఆ ముసలాడి బరువుబుట్ట దించి, వల ఆరవేసి, అతనికి కాస్త సహాయపడటంమాట అటుంచి, ఆముసలిది అతణ్ణిగురించి "ఉహు! దినమంతా తిరిగి తిరిగి వచ్చావూ? మరేం పనివుంది? సముద్రపు ఒడ్డున పిల్లనగ్రోవి వూదుకుంటూ కూచోవడమేగా? రోజంతా తిరిగి నాలుగు చేపలు తెస్తేనే సరిపోయిందా? కడుపు ఎట్లా నిండుతుంది? వలవేయడం చేతనయితేగా దొరికేది?" అని ఇంకా ఏమేమో సణుగుడు ఆరంభించేది.

ముసలాడికి ఈ సణుగుడుబాధ ఒకరోజుదీ, రెండు రోజులదీకాదు. జీవితమంతా యిదేగోల. అందుచేత అతడు ముసలిదాని మాటలు అంతగా లెక్క చేసేవాడుకాదు. ఏదో కలో గంజో కలిగింది తాగి, దేవుని పేరు తలచుకుంటూ హాయిగా నిద్రపోయేవాడు. అది అతని నిత్యనియమం.

ఒకదినం ముసలాడు యథాప్రకారంగా చేపల వేటకు వెళ్ళాడు. దినమంతా వల వేయగా వేయగా ఒక్క చేపకూడా దొరకలేదు. "ఏం చేయను భగవంతుడా!" అని నిరాశతో ఆఖరిసారి వల లాగుతూన్నాడు. ఈ సారి అతనికి

వల కాస్త బరువుగా వున్నట్టు తోచింది. పూర్తిగా బయటకులాగి వల విప్పేసరికి అందులో ఒకే ఒక బంగారు చేప దొరికింది. ఆ చిన్న చేప ఎంతో ముద్దుగాను, అందంగాను వుంది. అందుచేత దాన్ని అరచేతిలో పెట్టుకుని ముసలాడు ప్రేమతో రెండో అరచేతితో దాని వీపు నవరించాడు. కాస్సేపటికి చేప తెప్పరిల్లి "తాతా! నన్ను విడిచిపెట్టు, నేనీ సముద్రపు రాజకుమార్తెను. దయచేసి నన్ను విడిచిపెట్టినావా, నీవు కోరిందల్లా ఇస్తుంటాను. నీ పేదరికం పోగొడతాను" అన్నది దీనంగా. ముసలాడు దయపుట్టి మరల దాన్ని సముద్రంలో విడిచివేశాడు. సంతోషంతో కెరటాలమీద కేరింతాలు కొడుతూ బంగారుచేప తన భవనానికి వెళ్ళింది. కొంతసేపు ఈ బంగారుచేప కనుపించనందుకు ఇంటివద్ద చెలికత్తెలు, దాస దాసీ జనులు ఎంతో కంగారు పడసాగారు. కాని గండం గడిచి బంగారు చేప భవనం చేరుకున్నందుకు వారందరూ ఎంతో సంబరపడ్డారు. ఉత్సవాలు చేశారు. ఊరేగింపులు జరిపారు. ఆ బంగారు చేపను వుయ్యాలమీద వూపుతూ, పాటలు పాడుతూ కేరింతాలు కొట్టసాగారు. వారి రాణి దొరికిందిగా మరి ?

ముసలాడు సాయంత్రం వుత్త చేతులతో ఇల్లు చేరాడు. ముసలిది అది చూచి నిప్పులా మండిపోయింది. వున్న కోపమంతా ఒక్కసారే తీరిపోయే లాగ ఏమేమో తూలనాడ సాగింది. ముసలాడు కిక్కురుమనకుండా వూరుకున్నాడు. తరువాత ముసలమ్మ కోపం కాస్త శాంతించడం కనిపెట్టి, ముసలాడు నెమ్మదిగా బంగారుచేప సంగతి వినిపించాడు. ముసలమ్మ అప్పుడు కొయ్యతొట్టెలో బట్టలుతుకుతున్నది. "ఆ! చెప్పావు పోదూ, అన్నీ అబద్ధాలే; మరొక కొత్త తొట్టె తెప్పిస్తూ, చూస్తాను దాని సత్యమెట్టిదో?" అంది విసుగుకుంటూ.

మరునాడు ముసలాడు సముద్రతీరానికి వెళ్ళి "ఓ నా బంగారు చేపా ! ఎక్కడున్నావు? నా ప్రార్థన వినవూ?" అని పిలిచాడు. వెంటనే బంగారుచేప కెరటాలమీద పల్టీలు కొడుతూ వచ్చింది. దానికి భక్తిపూర్వకంగా ముసలాడు మూడుసార్లు వంగి దణ్ణంపెట్టి, స్వాగతం చెప్పి- "ఓ సముద్రపు రాజకుమార్తీ! మా ముసలిదానికి ఒక కొత్తకొయ్య తొట్టె కావాలిట" అన్నాడు.



"మరొక కొత్త తొట్టెను తెప్పిస్తూ, చూస్తాను, దాని సత్య మెట్టిదో"
అన్నది విసుగుకుంటూ.

"దాని కోరిక నెరవేరింది" అని బంగారు చేప మాయమయిపోయింది. ఇంటికి వచ్చి చూచేసరికి పాతతొట్టెకు బదులు మంచి చేవదేరిన మద్ది కర్రతొట్టె సిద్ధముగా వున్నది. ముసలాడు లోలోపల ఆ బంగారు చేపకు ఎన్నో ధన్యవాదా లర్పించుకొన్నాడు. కాని ముసలిదాని మనసు మాత్రం నిండలేదు. ఈసడింపుతో- " ఈకర్రతొట్టెలో ఏమంత మహాభాగ్యం వుందని దానికి పదే పదే ధన్యవాదాలిస్తున్నావు ? ఈ గుడిసె మేడగా మారిపోవాలని చెప్పు రేపు, చూస్తాను ?" అంది.

మరునాడు ముసలిది ముసలాడికి చద్దన్నం పెట్టకుండానే చీకటితో లేపి సముద్రతీరానికి తరిమింది అక్కడకు వెళ్లి ముసలాడు మరల "ఓ సాగరపుత్రీ, ఎక్కడున్నావూ? నా ప్రార్థన వినవూ?" అని పిలిచాడు.

సముద్రంలో పెద్ద పెద్ద కెరటాలు లేచాయి. బంగారు చేప ఆ కెరటాల మీద తేలి వచ్చింది, ముసలాడు తలమీది టోపీ తీసి మూడుసార్లు నమస్కారం చేసి "ముసలిదానికి గుడిసెలో వుండడం కష్టంగా వున్నది. గాన మంచి మేడ కావాలిట." అన్నాడు.

"దానికోరిక నెరవేరింది" అని చెప్పి బంగారు చేప వెళ్ళిపోయింది. ముసలాడు ఇంటికి వచ్చేసరికి పూరిగుడిసె మేడగా మారిపోయింది ఆమేడలో పంచభక్ష్య పరమాన్నాలు అన్నీవున్నాయి. వాకిట్లో ఆవులు మేస్తున్నాయి. మేడ చుట్టూ కోళ్ళు తిరుగుతున్నాయి. మేడకు నలువేపులా పచ్చని పైరులు రెప రెప లాడుతూవున్నాయి. ఇవన్నీచూచి ముసలాడు ముసలిదాంతో-"మనం పూర్తిగా జమీందారులం అయిపోయాం. ఇంకేమి కొరవ మనకు?" అన్నాడు సంతోషంగా.

పాపం, ముసలాడి రోజులు బాగానే గడుస్తున్నాయి. కాని ముసలిదానికి మాత్రం ఆశ తీరలేదు. అందుచేత ఆమెకు సంతోషంలేదు. "ఈ మేడకు బదులుగా పెద్ద భవనం అడగలేక పోతినే" అనే చింతలో పడింది. "మామూలు రైతు భార్యలా అన్నిపనులూ నేనే చేసుకోవాలి. అటు పొలంపని చూచుకోవాలి. ఇటు ఇల్లుపని చక్కపెట్టుకోవాలి. అబ్బ ! చావడానికి కూడా తీరికలేదు." అని విసుక్కుంటూ ఒకనాడు మరల ముసలాడితో "ఈ పనిపాటలతో మనసు



సముద్రంలో పెద్దపెద్ద కెరటాలు లేచాయి. బంగారుచేప ఆ కెరటాల మీద తేలివచ్చింది.

విసుగెత్తి పోయింది. జమీందారుని భార్యలా దర్జాగా వుండాలనుకుంటున్నాను. పెద్ద భవనం కావాలి. అందులో అనేక నౌకర్లు, దాసదాసీజనం దండిగా వుండాలి. ఈ సంగతి రేపు ఆ బంగారుచేపతో చెప్పు" అన్నది.

రెండవ రోజు పొద్దున్నే ముసలాడు సముద్రతీరం చేరాడు. ఈ సారి కాస్త సంకోచపడుతూ బంగారు చేపను పిలిచాడు. ముసలాడు ఎంత సంకోచంగా పిలిచాడో సముద్రంలో అంత పెద్ద కెరటాలు లేచాయి. బంగారుచేప ఆ కెరటాల మీద ఎక్కి వచ్చింది. ముసలాడు మూడుసార్లు వంగి సలాముచేసి "ఓ దయగల రాజకుమారీ! మా ముసలిది పెద్ద జమీందారిణిగా జీవించదలచుకున్నది. దాస దాసీ జనం, నౌకర్లు చాకర్లు, కథా కమామీషు అన్నీ కావాలిట" అని చెప్పాడు వినయంగా.

"దాని కోరిక తీరింది" అని చేప అంతర్ధానమయిపోయింది. ముసలాడు ఇంటికి వచ్చేటప్పటికి అద్దాలమేడ సిద్ధంగావుంది. దానిగదులు రకరకాల పటాలతో అలంకరించబడి వున్నాయి. దాసదాసీ జనులు ముసలిదాని సేవకు హాజరయి వున్నారు. ముసలిదానికి తలదువ్వేవారు ఒకరు, కాళ్ళు పట్టేవారు ఒకరు, ఇలానే ఒకరు అద్దం చూపుతూ నిలబడితే, మరి ఒకరు కొత్తబట్టలు చేతిలో పెట్టుకు నిలబడినవారుఒకరు,కొత్త చెప్పులు సిద్ధపరచేవారు మరొకరు. ఈ విధంగా ఆ ముసలిదాని వంటిమీద ఈగ వాలకుండా కాపాడుతున్నారు. మేజాబల్లల మీద నవకాయ పిండివంటలతో నానాపదార్థాలూ అమర్చబడి వున్నాయి. రకరకాల నగలతో బీరువాలు నిండివున్నాయి, చీని చీనాంబరాలతో పెట్టెలు నిండిపోయాయి. అమాయకపు ముసలాడు ఆ రాజవైభవం చూచి ఆశ్చర్య పడ్డాడు. వీటన్నిటికి కారణమయిన ఆ బంగారు చేపకు లోలోపల కోటి దణ్ణాలు అర్పించుకున్నాడు.

ఇట్టి భోగభాగ్యాలు కలిగేసరికి ముసలిదానికి తల బిరుసెక్కి పోయింది. మితిమీరిన గర్వంతో నీలిగింది. ఎల్లప్పుడూ, ప్రతి చిన్నవిషయానికీ, ప్రతివారి మీద చురచురలాడసాగింది. "ఇంటిలో ఎప్పుడు చూచినా ఒకదానికొకటి వుండదు. ఏదో ఒక లోటు ఎల్లప్పుడూ ఉంటూనే వుంటుంది. నీ బంగారు చేపకు

ఈ మాత్రం తెలివి తేటలులేవు? ఎంతో దయగల రాజకూతురంటావు. ఇంటిలో పలానివస్తువు లేదన్న సంగతి దానికి తెలియదా? ఇవన్నీ మరచిపోయిందా?" అని ఏమేమో సణుగుడు, సాధింపూను. పాపం ముసలాడు మూగవానిలా అన్నీ వింటూ వుంటాడు. ఒకొక్కప్పుడు భార్య తెలివితక్కువతనానికి చింతపడుతూ వుంటాడు. కాని దానితో రగడ పెట్టుకోలేక వూరికే కాలక్షేపం చేస్తున్నాడు.

ఇలా వుండగా వుండగా, ఒకదినం, ముసలిదానికి షికారు వెళ్ళాలని బుద్ధిపుట్టింది. ముసలాణ్ణి పిలిచి జోడుగుఱ్ఱాలబండి కట్టమంది. వెంటనేముసలాడు గుమ్మం దగ్గర బండి హాజరు పరిచాడు. పాపిష్ఠి ముసలిది, బండిలో అడుగు పెట్టగానే గుఱ్ఱాలు బెదిరాయి. ముసలాడు బలంగా కళ్ళాలు పట్టుకుని ఆపాడు. లేకపోతే ముసలిదానికి ముప్పు కలిగేదే. తరువాత ముసలిదాని వుత్తరువు కాగానే బండి నడవసాగింది. బాగా తిరిగి అరిగి ఇల్లు చేరుకున్నారు. ఇల్లు చేరగానే ముసలిది ముసలాడిమీద కోప్పడుతూ"బండిమీద తిరగడమంటే నాకసలే చిరాకు. దుమ్మంతా నెత్తినే పడుతుంది. రాణిగారికి చేసినట్టు దారిలో నాకెవరూ వంగి సలాములుకూడా చేయరు. ఇట్టి అవమానకరమయిన బ్రతుకు బతకలేను. కాబట్టి నన్ను ఒక మహారాణిగా చేయమని రేపు వెళ్ళి ఆ చేపతో చెప్పు" అన్నది చీకాకుపడుతూ.

ముసలాడు ముసలిదాని తిట్లు ఎంతకాలం పడతాడు? విసుగు చెందాడు. ఈసారి సముద్రతీరానికి వెళ్ళవద్దనుకున్నాడు. కాని ముసలిదాని ఆజ్ఞపాలించక పోవడం కూడా ప్రమాదమే. తీరా అక్కడికి వెళ్ళి వరము లేకుండా వస్తినా; మరి తనను ఇంటిలోకే రానివ్వదని కూడా అతనకి తెలుసును. ఇవన్నీ ఆలోచిస్తూ, ఆలోచిస్తూ- "ఓ రాజకుమారీ ! దయచేసి నా ప్రార్థన వినవూ?" అని మరల పిలిచాడు. ఈసారి సాగరంలో మరీ పెద్ద అలలు లేచాయి. బంగారపు రాజకుమారి అందులో ఒక అల మీద కూర్చుని వచ్చింది. "నీ ముసలి దానికి ఏమి కావాలి?" అని అడిగింది. ముసలాడు సంకోచిస్తూ ముసలిదాని కోరిక తెలియజేశాడు. "సరే, ముసలిదానికి ఈ కోరిక కూడా నెరవేరింది." అని చేప మాయమయి పోయింది.

ముసలాడు ఇంటికి తిరిగి వచ్చేసరికి తన ఇల్లు పెద్దకోటగా మారి పోయింది. కోట చుట్టూ ఎత్తయిన ప్రహారీ గోడ, గోడ వెలుపల లోతయిన కందకం, ప్రతి కోటగుమ్మం వద్ద ఆయుధపాణులైన సిపాయీల కాపలా, పెద్ద రాజకీవిగా వున్నది. కోటలోపల నందనవనంలాంటి పూలవనం, వనం మధ్య తెల్లని పాలరాతి అరుగులు, ఆ అరుగులమీద ముసలమ్మ కిరీటంతో అపర రాణిలా ఆసీనురాలయివున్నది. చుట్టూ దాసదాసీ బృందం "జీ హుజూర్!" అనుకుంటూ ఆజ్ఞలకు వేచివున్నారు. ఆ ఇంద్ర వైభవం చూచేసరికి ముసలాడి ఆశ్చర్యానికి అంతులేక పోయింది. అపరరాణిలా వున్న తన ముసలి భార్యకు ముసలాడు వంగి వంగి సలాములు చేశాడు. రాజవైభవం పొందిన తరువాత ముసలిదాని గర్వం, అధికారం హద్దులు మీరి పోయినై. దానితో దాని తల తిరిగిపోయింది. ఏ ముసలిభర్త ద్వారా ఈ దేవేంద్ర భోగం తనకు ప్రాప్తించిందో ఆ ముసలి పతిని నౌకర్లచేత మెడ పట్టించి బైటకు గెంటించింది. పాపం అమాయకపు ముసలాడు సిపాయీల తన్నులూ, గుద్దులూ సహించుతూ కోట బైట పడ్డాడు. ఈ లోపల ఆయన టోపి కూడా యెక్కడో పడిపోయింది. కోట బైట గుఱ్ఱాలశాల ఆయనకు దిక్కయింది. అక్కడే హాయిగా వుండ సాగాడు. కాని తన ముసలి భార్య గర్వానికీ అభిమానానికీ తరచు లోలోపల చింత పడుతూ వుండేవాడు. కోటలో దాసదాసీ జనులను తన బూటు కాళ్ళతో తన్నుతున్నదని, తప్పులు చేసినప్పుడు వారిని కొరడాలతో బాదుతుందనీ విన్నప్పుడు మరీ దుఃఖపడుతుండేవాడు, పాపం. కాని ఏమి చేయగలడు అమాయకుడు!

కొంతకాలానికి ఒక రాత్రి సముద్రంలో తుపాను రేగింది. ఉప్పొంగే పెద్ద పెద్ద కెరటాలతో సాగరం హోరెత్త సాగినది. సరిగ్గా ఆ ముసలిరాణి నిద్రపోయే సమయం. సముద్రపు ఘోష ఆమె నిద్రకు భంగం కలిగించింది ఎత్తయిన కోట కిటికీలనుండి ముసలిరాణి సముద్రగర్జన విన్నది. ఉప్పొంగే కెరటాలను చూచింది. చూస్తూ చూస్తూ మనసులో "నేనే గనక సముద్రపు రాణినయితినా, దాన్ని నా అదుపు ఆజ్ఞల్లో వుంచేదాన్ని. ఈ విధంగా

గర్జన భర్జనలు చేయనిస్తునా ? ఆ బంగారు చేపమీద కూడ నా అధికారము నడిచేది" ఈ విధమైన ఆలోచనలు పరుగులెత్తసాగాయి.

మరునాడే ముసలాడిని తన యెదుట హాజరు చేయమని సిపాయిలకు హుకుం చేసింది. వెంటనే గుఱ్ఱాలశాలలో హాయిగావుండే ముసలాణ్ణి నిర్దయతో యీడ్చుకొచ్చి, ముసలిరాణి యెదుట నిలబెట్టారు. ఆ అమాయకపు ముసలాడికి ఏమీ అర్థం కావడం లేదు. "మరల తనను ఎందుకు రప్పించిందో; మరి ఏమి చేయ మంటుందో; ఇంత ఇంద్రభోగం లభించిన తరువాత కూడా మరి ఏ భోగం మిగిలి పోయిందో; మహారాణి అయిన పిమ్మట కూడా ఇంకా ఏ పదవిని పొందదల చిందో" అని మనస్సులో కలవర పడుతున్నాడు, ముసలాడు.

ముసలిరాణి ముసలిభర్తను గద్దిస్తూ "నీవు వెంటనే కడలి గట్టుకు వెళ్లి, నా మహారాణి సముద్రం మీద కూడా రాజ్యం చేయగోరుతున్నదనీ, నీవు స్వయంగా నారాణి చెలికత్తెల్లో ఒక చెలికత్తెగా హాజరయి, రాణిసేవ చేస్తుండా లని కూడా, ఆ బంగారు చేపతో చెప్పు" అని తీవిగా ఆజ్ఞాపించింది. పాపం ఆ ముసలాడు ఏమీ చెప్పలేక ఆశ్చర్యపడి బిత్తరిచూపులు చూస్తూ వున్నాడు. ముసలిరాణి అది చూచి ఆడసింహంలా గర్జించింది. "చూస్తావేం ? వెళ్ళు ! ... వెళ్లు ! ! .... .... ఇప్పుడే వెళ్ళు ! వెళ్ళాలి ! ... ... తప్పదు ! ! ... ఇది నా హుకుం ! ! ! "

పాపం, ఆ ముసలాడు సాగరతీరానికి వణుకుతూ వణుకుతూ, వెళ్లలేక వెళ్లలేక వెళ్ళాడు. ఆకాశంమీద కారుమేఘాలు కమ్ముకున్నాయి. మెఱుపులు మెరుస్తు న్నాయి. ఉరుములు ఉరుముతున్నాయి. ఈసారి బంగారు చేపను భయపడుతూ భయపడుతూ పిలిచాడు. సముద్రంలో మరల గొప్పతుపాను లేచింది. అలలతో సాగరం కల్లోలమయింది. ధారాపాతముగా వాన కురుస్తున్నది. ముసలాడు వానలో తడుస్తూ అలాగే నిలబడివున్నాడు. మరికొంతసేపటికి పెద్ద పెద్ద గర్జనలతో నల్లనల్లని మేఘాల్లాంటి కెరటాలు లేచాయి. బంగారుచేప రాజఠీవితో ఆ కెరటాలమీద ఎక్కివచ్చింది. 'ఏమితాతా ! మహారాణీ అయిన తరువాత

కూడా నీ ముసలిదానికి మరేమయినా కోరికలు మిగిలిపోయినవా ? " అని ప్రశ్నించింది.

ముసలాడు నమ్రతగా మూడుసార్లు తలవంచి నమస్కరించి, తన ముసలి రాణి గర్వపు కోరిక వున్నది వున్నట్టుగ ప్రకటించాడు. పాపం, ముసలాడు సత్యసంధుడు. ఆ మాటలు విన్న వెంటనే సాగరరాజు కోపంతో భయంకరముగా గర్జించాడు. కెరటాలు గర్జించాయి. బంగారుచేప తన అలలతో మాయమై పోయింది. ఎంతసేపటికీ జవాబు రాకపోవడం చూచి విచారముతో ముసలాడు తనకోట చేరుకున్నాడు. అక్కడ జరిగిన అద్భుతపరివర్తనం చూచి అబ్బురపోయాడు. అక్కడ ఆ కోటాలేదు. ఆ పూలవనం లేదు, దాసదాసీ జనులు కూడా కనుపించలేదు. ఆ ఇంద్రవైభవమే పోయింది. వాటిస్థానంలో కేవలం ఆ పాత పూరిగుడిసె, ఆ పాత వోటితొట్టె రెండూ మిగిలిపోయాయి. పేరాశగల ఆ ముసలిది బట్టలకు సబ్బు పెట్టుకుంటూ కూచున్నది.

ఇదంతా చూచి ముసలాడు వేదాంతునివలె "ఆశాపరులు ఎప్పుడూ సుఖపడలేరు. దురభిమానానికి అవమానము తప్పదు" అనుకున్నాడు.

---

కొరియాదేశపు కథ

# పితృవాక్య పాలనం

అవనీంద్ర కుమార్

'అంజు' అనే వూరిలో 'కిం' అనే వ్యక్తి వుండేవాడు. అతడు తన ఊహ యెరిగిన నాటినుండి కించత్ పనిచేసిన పాపానగాని, ఒక్క కానీ, సంపాదించిన పాపానగాని పోలేదు. గాలికి తిరగడం, గప్పాలు కొట్టడంతోనే అతని రోజులు గడచిపోతుండేవి. ఈలా వుండగా వుండగా, ఒకసారి ఒక అత్యంత అవసర కార్యానికి అతనికి డబ్బు అవసరమయింది. "ఎక్కడ దొరుకుతుంది? ఎవరు యిస్తారు?" అని ఎంతో ఆలోచించాడు. ఏమీ లాభం లేక పోయింది. ఇంతలో ప్రక్క వూరిలో ఉన్న ఒక బంధువు జ్ఞాపకం వచ్చాడు. అతడు బాగా డబ్బున్న వాడు. రెండుమూడువేలు అప్పు యివ్వడమంటే అతనికి ఒక లెక్కలోని మాట కాదు. అందువల్ల 'కిం' ఏవిధమైన సంకోచం లేకుండా వెళ్ళి ఆ బంధువును రెండువేల రూపాయలు ఇమ్మని అడిగాడు. 'కిం' ను చూచేసరికే ఆడబ్బుగల చుట్టానికి దయ కలిగింది. అడిగీ అడగడంతోనే, కారణం కూడా తెలుసుకోకుండానే 'కిం' కు రెండువేలూ యిచ్చాడు. ఆ రెండువేల రూపాయలతో అతను ఉషారుగా తిరిగి వస్తున్నాడు.

దారిలో ఒక నది దాటవలసి వచ్చి, నావకొరకు ఎదురుచూస్తూ నిలబడి పోయాడు. ఎదురుగా అక్కడికి కొంతదూరంలో ఒక యువకుడు ఒడ్డున వున్న రాతిబండమీదనుంచి నదిలోకి దూకబోతున్నాడు. ఒక యువతి కోటుపట్టుకుని అతన్ని వెనక్కు లాగుతున్నది, యువకుడు వెనక్కువచ్చినప్పుడు యువతి నదిలో పడబోతున్నది, యువకుడు ఆమెను ఆపుతున్నాడు. 'కిం' ఆ దృశ్యాం చూచి ఆశ్చర్యపడ్డాడు. "ఆ యువతీ యువకులు ఆ విధంగా చేయుటకు కారణము ఏమిటా?" అని లోలోపల తర్కించుకోసాగాడు. కడకు వారిని సమీపించి సంగతి తెలుసుకున్నాడు. ఆవేళ ఆయువకునివల్ల ఆఫీసులో రెండువేలరూపాయల



అతనికి ఎదురుగా కొంత దూరంలో ఒక యువకుడు నది వొడ్డున వున్న రాతి బండమీదినుంచి నదిలో దూకబోతున్నాడు. దగ్గరనున్న యువతి అతని కోటు పట్టుకొని వెనక్కి లాగుతున్నది.

లెఖ పొరపాటు జరిగింది. ప్రొద్దుగుంకేలోపల ఆలోటు పూర్తిచేయమని అతని అధికార్లు ఆజ్ఞాపించారు. పాపం, అతను మామూలు గుమాస్తా. అతనికెలా సాధ్యపడుతుంది ? కడకు లోటుతీరే ఉపాయం లేక ఆత్మహత్య చేసుకోబోతున్నాడు. అతని భార్య అతన్ని వారిస్తున్నది. 'నామాట వినకపోతే నీకన్న నేనే ముందు నదిలో దూకుతా'నని యువతి దూకబోతున్నది. 'వద్ద'ని ఆయువకుడు ఆమెను అడ్డుతున్నాడు. ఇది ఆ కథ.

జాలిగొలిపే యువక దంపతుల కథ వినేసరికి 'కిం' హృదయం కరిగిపోయింది. దానితో తన కష్టం కూడా మరచిపోయాడు. తాను తెచ్చు

కుంటున్న ఆ రెండువేల రూపాయలూ ఆ దంపతులకిచ్చి, తాను ఉత్తచేతులతో ఇల్లు చేరుకున్నాడు. కాని ఆ యువకదంపతులు "అతనెవరో మనపాలిటిదేవుడు" అనుకొని ఆతని పేరు పూరా తెలుసుకున్నారు. ఎలాగయితేనేం అతను 'అంజు' నివాసి 'కిం' అని మాత్రమే తెలునుకోగలిగారు. అంతే.

'కిం' ఉత్తచేతులతో ఇల్లుచేరాడు. ఇంటివద్ద దరిద్రదేవత అలానే తిష్ఠవేసి కూచున్నది. ఇలా వుంటుండగా కొంతకాలానికి 'కిం' ఒక బుద్ధ భిక్షువు వద్దకు రాకపోకలారంభించాడు. అది చూచి లోకులందరూ ఇతను బౌద్ధ భిక్షువు అయిపోయినాడని అనుకోసాగారు. కాని 'కిం' నిజానికి ధర్మం మార్చుకోలేదు. బౌద్ధ భిక్షువును తన గురువుగా మాత్రమే చేసుకున్నాడు.

ఈ విధంగా కొన్ని యేండ్లు గడిచాయి. ఒకదినం 'కిం' తన మృత్యువు సమీపించినదని తెలుసుకొని, తన కుమారుని పిలిచి నేను చనిపోయిన తరువాత నా అంత్యక్రియలు ఆ బుద్ధసాధువునడిగి, అతని సలహా ప్రకారమే చేయాలిసుమా?" అని ఉపదేశమిచ్చి కన్నుమూశాడు. కొడుకు తండ్రి ఆజ్ఞాపాలకుడు. తండ్రిది కడసారి కోరిక. అలాంటప్పుడు కొడుకు తండ్రి ఆజ్ఞను పాలించడం వింతకాదు. తండ్రి మరణానికి కుమారునికి ఎంతో దుఃఖం కలిగింది. అయినా ఆ దుఃఖం లోలోనే దిగమింగి, శవాన్ని ఒక తెల్లని బట్టలో చుట్టబెట్టి, భుజాన పెట్టుకుని ఆ బౌద్ధభిక్షువును వెదకుతూ 'యాంగ్ గేన్' పర్వత శిఖరాలవైపు వెళ్లసాగాడు. కొండలు ఎక్కగా ఎక్కగా ఒకచోట ఆ సాధువును కనుక్కొన గలిగాడు. అప్పటికి ఆ బౌద్ధసాధువు సమాధిలో ఉన్నాడు. యువకుడు సాధువుకెదురుగా శవంతో నిలబడివున్నాడు. కొంతసేపటికి సాధువు సమాధినుండి మేలుకొని, ఎదురుగవున్న యువకుని చూచి, "అబ్బాయీ! అదిగో, ఆ కనుమలో కనుపించే మేడను పడగొట్టాలి; దానిఅవతల సమతల ప్రదేశం ఉన్నది. అదే నీతండ్రిని సమాధి చేయవలసిన చోటు" అని చెప్పాడు.

బౌద్ధసాధు మాటలకు యువకుడు కాస్త కంగారుపడ్డాడు. అప్పటికే శవాన్ని మోసిమోసి అలసివున్నాడు. శవాన్ని దించి చెమట తుడుచుకుంటు



ధ్యానభంగం కావడంలోనే సాధువు ఆ అబ్బాయిని చూచి, అతనితో "ఈ కనుమలో ఆ కనుపించే ఎత్తయిన మేడ వెనకాలవున్న ప్రదేశంలో మీతండ్రి శవాన్ని సమాధి చేయాలి" అని చెప్పాడు.

న్నాడు. సన్యాసి సలహా అతనికి నచ్చలేదు. "తండ్రి శవాన్ని కొండకిందనుంచి యింతపైకి తెచ్చినా ఇక్కడ కూడా అంతిమ సంస్కారం చేయడానికి తగిన చోటు దొరకలేదు. ఆ ఎదురుగా కనుపించే లోగిలి పడగొట్టాలి; తరువాత ఆ వెనుకనున్న ప్రదేశంలో శవాన్ని పాతిపెట్టాలి. అంటే, ముందు ఆ మేడను కొనాలి, ఆ తరువాత దాన్ని పడగొట్టాలి అన్నమాట. ఎందుకీ శ్రమా?" అని యువకుడు ఆలోచనలో పడ్డాడు- "సాధు వేళాకోళమయితే చేయడంలేదుగదా" అని అనుమానపడ్డాడు కూడా. కాని సాధు ముఖవర్చస్సులో అట్టిగుర్తు లేమీ కనుపించలేదు.

కొంతసేపటికి సాధు సమాధినుండి లేచి, శవాన్ని అక్కడవుంచి, నీవు నావెంట రమ్మని యువకునికి సైగచేశాడు. నెమ్మది నెమ్మదిగా చీకటి పడుతున్నది. ఆ మేడవద్దకు వెళ్ళేసరికి పూర్తిగా చీకటిపడిపోయింది.

ఆ మేడచుట్టూవున్న గోడ అంతఎత్తుగాలేదు. సాధువు "నీవు నా వీపునెక్కి గోడ అవతల ఏమివున్నదో చూడు" అని యువకునితో అన్నాడు. ఈ మాటలకు యువకుడు ఆశ్చర్యపడలేదు. ఎందుకంటే, కొరియా భాషలో "గోడఅవతల ఏమున్నదో చూడు" అను వాక్యములోనే ఒక అనిష్టకరమయిన అర్థం వున్నది. ఇది ఆ యువకుడు వెంటనే గ్రహించగలిగాడు. సాధువు వీపుమీద ఎక్కి గోడ అవతల చూస్తుండేసరికి హటాత్తుగా సాధువు ఆ యువకుని ఒక్కతోపు తోశాడు. దానితో అ యువకుడు గోడఅవతల డొంకలో తల్లక్రిందులుగ పడిపోయాడు. ఆ సమయంలో అతన్ని యితరులు దొంగగా భావించి కొట్టినా కొట్టవచ్చును. సందేహంలేదు.

యువకుడు పడినవాడు పడినట్టుగానే వుంటూ, మేడవైపు తిరిగిచూచాడు. మేడగుమ్మంలో నుంచి ఒక స్త్రీ వస్తున్నట్టు అతనికి కనుపించింది. కొంతసేపటికి బయటకువచ్చి, అరుగుమీద కూచుని, అక్కడవున్న సమాధికి చేతులు జోడించి ప్రార్థన చేయసాగింది. నెమ్మది నెమ్మదిగా ఆమె మాటలు అతనికి వినిపించాయి. "హే ప్రభో! మాదంపతులను ఆపదనుంచి రక్షించిన ఆ అవతార పురుషుని దర్శనం మాకు కలుగజేయుము. ఆ మహాపురుషుని పేరు "కిం" అని అంటారు.

యువకుడు "కిం" అనుమాట వినగానే తొందర తొందరగా వళ్ళు దులుపుకుంటూ లేచాడు. చుట్టూ చీకటిమయమే. అయినా తన ముఖంమీద మాత్రం కాస్త వెలుతురు పడుతున్నది. లేచేసరికి ఆ యింటినౌకర్లు వచ్చి యువకుని పట్టుకుని తమయజమానికి వప్పగించారు.

"ఎవరవు నీవు ? ఇక్కడ ఏమిచేస్తున్నావు ?"

"నేను 'అంజు' నివాసిని, 'కిం' ను. నాతండ్రి అంత్యక్రియలు జరపడానికి 'యాంగ్ గేన్' వచ్చాను"

"ఆ! 'అంజు' వాసి 'కిం'! మమ్ము రక్షించిన వాడు !! మాకు పునర్జన్మ ప్రసాదించినవాడు !!! ఓహో !! సరిగ్గా 'కిం' లానే వున్నావు. అతని కొడుకువు కాదుగదా ?"

"అవును, అతడు మాతండ్రే."

"భగవంతుడా! నీకు కోటి ధన్యవాదాలు. ఎంతకాలమునుండో వెదకుతున్నాము. నేటికి మా శ్రమ ఫలించింది." "నాయనా! నీవు మాకు కొడుకు లాంటి వాడవు. నీతండ్రి మూలముననే మాకు ఈ సంపద లభించినది. ఈవైభవము ప్రాప్తించినది. గాన ఇందు సగభాగం నీకోసం భద్రంగా పెట్టి వుంచాము. స్వీకరించు నాయనా !"

కృతజ్ఞతా భారముతో ఆ యువకుని శిరము వంగినది. హృదయము ప్రేమతో నిండినది. తండ్రి జేసిన పుణ్యఫలమును కొడుకు అనుభవిస్తున్నాడు.

---

జపాను దేశపు కథ

# సాగరజలం ఉప్పగా.......?

టోమోజీ మూత్రో

ప్రాచీనకాలంలో ఒక వూరిలో ఇద్దరన్నదమ్ములుండేవారు. పెద్దవాడు ధనధాన్యాదులు, సిరిసంపదలతో తులతూగుతూవుంటే, చిన్నవాడు దరిద్రంతో అన్నానికి ఆతృత పడుతూ వుండేవాడు. ఒకసారి ఆ వూరివారంతా ఉగాది పండగ ఎంతో వేడుగ్గా చేసుకుంటున్నారు. పాపం చిన్నవాని ఇంటిలో పొయిమీది పిల్లి లేచే దిక్కు లేదు. అందుచేత అన్నవద్దకు వెళ్ళి, ఒక శేరు బియ్యము బదులు అడిగాడు. అన్నగారు మొండి చేయి చూపించి పంపాడు. పాపం తమ్ముడు తల వంచుకొని నిరాశతో తిరిగి వస్తున్నాడు దారిలో పుల్లలు మోసుకొచ్చే ఒక ముసలాడు అతనికి ఎదురయి "ఎక్కడికి వెడుతున్నావోయ్? ఏదో కష్టదశలో వున్నట్టున్నావేం?" అని అడిగాడు.

తమ్ముడు, ముసలాడికి తన కథను వినిపించాడు. కథ విని ముసలాడు, "చూడు అబ్బాయి! ఈ పుల్లల మోపు నాయింటికి చేర్పించావా, నీకొక వస్తువు యిస్తాను. దానితో నీవు ధనవంతుడవవుతావు" అన్నాడు.

పాపం తమ్ముడు పరోపకారి గాబట్టి ఆ పుల్లలకట్ట తన నెత్తిన పెట్టుకుని ఆ ముసలాడి ఇంటికి చేర్పించాడు.

ఇంటికి వెళ్లిన పిమ్మట ముసలాడు అతనికి ఒక బొబ్బట్టు ఇచ్చి, ఇల్లా అన్నాడు- "ఇదిగో ఈ బొబ్బట్టు తీసుకుని ఫలానా మందిరం వెనుక భాగంలో వున్న అడవిలోకి వెళ్లు. అక్కడ ఒక సొరంగము అగుపడుతుంది. అందులో

ఎంతోమంది మరగుజ్జు వాళ్లు ఉంటారు. వాళ్ళకి బొంబ్బట్టు అంటే పరమ సంతోషం. ఎంత ధరయినా ఇచ్చి ఇది కొంటారు. కాని వాళ్ళు అడిగినప్పుడు దీనిని ఇచ్చివేయి. బేరమాడవద్దు. తరువాత వాళ్ళు నీకేమి కావాలని అడుగుతారు. దానికి నాకు డబ్బు, దస్కం కావాలని చెప్పవద్దు. ఒక రాతి తిరగలి ఇమ్మని మాత్రం అడుగు. దాని మహిమ ముందు ముందు నీకే తెలియగలదు."

ఆ ముసలివాని నుండి శెలవు తీసుకుని తమ్ముడు మందిరం వెనక వైపుకు వెళ్ళాడు. అక్కడ అడవిలో ఒక సొరంగం వున్నది. దాంట్లో నుంచి కొందరు మరగుజ్జు వాళ్లు వస్తూ పోతూ వున్నారు. వారిలో కొందరు ఒక కొబ్బరి చెట్టును వరికి సొరంగంలోకి ఈడ్చుకు పోతున్నారు. అది వాళ్ళకు ఎంతో కష్టంగా వుంది. అందువల్ల అంచెలంచెలుగా లాక్కుపోతున్నారు. తమ్ముడు వాళ్లతో "నేను కాస్త సహాయపడతానని" ఆ చెట్టును చేత్తో పట్టుకు వెళ్లి సొరంగం వద్ద పడేశాడు. అక్కడకు వెళ్లడంతోనే అతనికి సన్నని కంఠ ధ్వని వినిపించింది. "రక్షించండి! రక్షించండి!!" తమ్ముడు అటు ఇటూ కంగారుగా చూచేసరికల్లా, అతని కాలి వేళ్ల మధ్య నుంచి ఒక మరగుజ్జు లేస్తున్నాడు. వెంటనే తమ్ముడు అతన్ని చేయి పట్టుకుని లేవదీశాడు. అతడు ఆ మరగుజ్జు వాళ్ళ రాజాగారి కుమారుడు.

తరువాత ఆ రాజపుత్రుని దృష్టి తమ్ముని చేతిలోవున్న బొబ్బట్టుమీద పడింది. "అది నాకిస్తావా? దానికి బదులు ఎన్నోనగలు ఇస్తాను" అన్నాడు రాజుకొడుకు. తమ్ముడు ముసలివానిమాట మరువలేదు. బొబ్బట్టుకు బదులుగ తిరగలి ఇమ్మని అడిగాడు. మరగుజ్జువాళ్ళరాజు తనకొడుకును సంతోషపెట్టడానికని బొబ్బట్టు తీసుకుని, దానికి బదులుగ రాతితిరగలి ఒకటి ఇచ్చాడు. తమ్ముడు తిరగలి దొరికింది అనే సంతోషంతో వెళ్లిపోతున్నాడు. అతన్ని వెనక్కు పిలిచి రాజు ఇలా అన్నాడు- 'ఇదిగో, ఈ తిరగలి మా రాజ్యంలో కల్లా ఎక్కువ విలువయిన వస్తువు. దీన్ని అతి జాగ్రత్తగా వాడాలి సుమా! దీన్ని కుడి చేతితో తిప్పావంటే నీ వడగిన వస్తువు, పదార్థము అన్నీ దీనిలో నుంచి వస్తాయి. మరల దాన్ని ఎడమ చేతి వేపుకు తిప్పినంతవరకు అందులో

నుండి పదార్థాలు వస్తూనే వుంటాయి. ఆగవు. ఈ సంగతి మాత్రం మరువరాదు సుమా ? "



"దయచేసి ఆ బొబ్బట్టు నాకు యివ్వండి. దానికి బదులుగా
తమకు ఎన్నో నగలు ఇస్తాము" అన్నాడు.

తమ్ముడు తిరగలి తీసుకుని ఇంటికి వచ్చాడు. పాపం అతని భార్య అకలి దప్పులతో అతని రాకకు ఎదురు చూస్తూ కూచున్నది. భర్త వుత్త చేతులతో రావడం చూచి ఒక నిట్టూర్పు విడిచింది. భర్త వచ్చీ రావడంతోనే భార్యతో "తొందర తొందరగా చాప పరువు ?" అన్నాడు. భార్య చాప పరిచింది. వెంటనే తిరగలి దానిమీద పెట్టి, కుడి చేతి మీదుగా తిప్పి, "బియ్యం కావాలన్నా"డు. అనడమే తరవాయి, రాసులు పడిపోయినై. తరువాత "చేపలు కావాలన్నా"డు. చేపలు గుట్టలే వచ్చాయి. తమ్ముడు ఈ విధంగా కోరిన వస్తువల్లా పొంద గలుగుతున్నాడు.

తరువాత తమ్ముడు "నేనింత భాగ్యశాలినయినప్పుడు పూరి గుడిసెలో వుండమని యెవరు చెప్పారు? పెద్ద పెద్ద మేడలు కావాలి. గుర్రాలు, బండ్లు, దాస దాసీలు, సమస్త సౌకర్యాలూ అన్నీ కావాలి" అని ఆలోచిస్తూ, మరు క్షణంలోనే ఆ తిరగలి సహాయంతో అవన్నీ పొందగలిగాడు. సంతోషంతో ఇరుగు పొరుగును, తరువాత వూరందరినీ పిలిచి విందు చేశాడు. ఆ విందులో యిదివరకు ఆ వూరివారు ఎవరూ తిని ఎరుగని రకరకాల పిండివంటలు, రుచి కరములయిన భోజన పదార్థాలు పెట్టించాడు. తమ్ముడు ఆనాడు ఈ విధంగా తన ఉగాది పండుగ చేసుకున్నాడు.

ఇదంతా చూసేసరికి అన్నగారికి అసూయ గలిగింది. "ఒక్క పూటలోనే ఇంత ధనవంతుడు యెట్లా అయ్యాడా?" అని అతనికి చింత పట్టుకున్నది. ఏమైనా సరే తెలుసుకోవాలనుకున్నాడు. ఆ రాత్రిపూట గుమ్మంవద్దకు వచ్చి తలుపు సందుల్లోనుంచి చూడసాగాడు. లోపల తమ్ముడు తిరగలి తిప్పుతూ మిఠాయి, బుట్టలు బుట్టలు నింపి వేస్తున్నాడు. దాంతో అన్నగారి గుండెలో రాయి పడి పోయింది. ఏ విధంగానైనా ఆ తిరగలిని కాజేయాలనుకున్నాడు.

ఒక నాటి రాత్రి అందరూ నిద్రపోతుండగా అన్నగారు దొడ్డిదారిని తమ్ముని ఇంటిలో ప్రవేశించి ఆ తిరగలి దొంగిలించాడు. తరువాత ఆ తిరగలితో తను ఆవూరిలోనే వున్నట్లయితే ఆ సంగతి అందరికీ వెల్లడయిపోతుందనీ, ఎవరికీ తెలియని ఏకాంతస్థానానికి వెళ్లి అక్కడ ఈ తిరగలి ద్వారా లక్షాధికారి కావాలనీ ఆలోచించి, ఒక నావ మీద దూరదేశం పయనమయ్యాడు. అలా కొంతదూరం వెళ్లేసరికి అతనికి ఆకలయింది. ఆ తెలివిగల అన్నగారు తినుబండారా లన్నీ తెచ్చుకున్నాడు. కాని ఒక్క ఉప్పు మాత్రం మరచివచ్చాడు. వెంటనే తనవద్ద నున్న కోరిక లిచ్చే తిరగలి మాట జ్ఞాపకం వచ్చి, తిరగలి కుడివేపుకు తిప్పి ఆతురతతో "ఉప్పు కావాలి, ఉప్పు కావాలి?" అన్నాడు.

అనడమే తడవుగా ఉప్పు రాసులు రాసులుగా పడిపోయింది. అన్నగారికి తిరగలి తిప్పడమే తెలుసుగాని ఆపడం తెలియదు. తిరగలి తిరుగుతూవుంది. ఉప్పు

రాసులు రాసులుగా పడిపోతున్నది. పడవ ఎంత బరువు మోయగలదు ? ఆఖరికి ఆ ఉప్పు బరువుతో పడవ మునిగిపోయింది.

నాటి నుంచి నేటి వరకు ఆ తిరగలి అలా నిర్విరామంగా తిరుగుతూనే వుందనీ, దానిలో నుంచి ఉప్పు వస్తూనేవుందనీ, అందుచేతనే సముద్రపు నీరు ఉప్పగా వుంటుందని అంతా అనుకుంటూ వుంటారు.



ఉప్పు బరువుతో నావ, నావతో అన్న మునిగిపోయాడు.



"మృగములు, పక్షులు, చిన్నలు, పెద్దలు, అను వర్గ భేదాలు లేకుండా అందరూ సమానముగా నేటినుండి తప్పనిసరిగ కోడిగ్రుడ్లలాంటి గ్రుడ్లే పెట్టవలయునని, గార్దభ మహారాజునైన నేను మీకు ఆజ్ఞాపించు చున్నాను."

జర్మను దేశపు కథ

# కోడిగ్రుడ్లు

మహాదేవ కర్మార్కార్

ఒకసారి సాధు జంతువులు, అడవిమృగాలు అన్నీ కలసి సభచేసుకుని, ఒక గాడిదను తమ రాజుగా చేసుకున్నాయి. మంత్రి మండలిలో కోతి ప్రధానమంత్రిగాను, కొమ్ములు ఆయుధాలవలె వాడిగావుంటాయి గాన వృషభం యుద్ధ మంత్రిగాను నియమించబడ్డాయి. ఆ మంత్రులు తమతమ బంధువుల్ని, మిత్రుల్ని కావలసినవారినందఱినీ పెద్ద పెద్ద పదవులకు నియమించేసుకున్నారు. కోళ్లు రాజుగార్కి అతియిష్టం. అందువల్ల కోడిపుంజు రాజుగారికి ప్రియివేటు సెక్రిటరీ

అయింది. అదికూడా తనవారినీ, తన అత్తవారి తరఫువారినీ ముఖ్య ముఖ్య ఆఫీసర్లుగా నియమించింది. కోడిపెట్టలు చక్కని గుండ్రని గ్రుడ్లు పెడతాయి. ఆ గ్రుడ్లు గుండ్రగా ముద్దుగా ఉంటాయి. ఆ గ్రుడ్లలోంచి వచ్చే పిల్లలంటే రాజుగారికి మరీప్రీతి, ఎందుకనగా అవి గుండ్ర గుండ్రంగా, చిన్న చిన్నవిగ, మెత్త మెత్తగ, రసగుల్లాలవలె వుంటాయి. అందుకే గార్దభరాజుగార్కి కోళ్లంటే అంతయిష్టం. "సర్వాధికారిని కాగలిగాను గాబట్టి రాజ్యంలో సమానత్వం తీసుకు రావాలి; కట్టు, జుట్టు బొట్టు. ఆచారవ్యవహారాలు అన్నీ ఒకే విధంగా వుండేట్టు చేయాలి" అని గార్దభరాజుకి ఆలోచనపుట్టింది.

అందుకోసం ఒకనాడు పెద్ద దర్బారు జరిగింది. దానికి ఊరి జంతువులు, అడవిమృగాలు అన్నీ హాజరయినాయి. గార్దభ మహారాజుగారు అందరికంటే ఎత్తుగా సింహాసనంమీదకు దయచేశారు. వృషభంగారు, మర్కటమహాశయులు గారు, కోడిపుంజు సాహెబ్‌గారు వారివారి ఆసనాలమీద ఆసీనులయి వున్నారు. కార్యక్రమం ఆరంభమయింది. ముందుగా గార్దభమహారాజుగారు లేచి సభికులందరికి ఐకమత్యము, సహకారములను గూర్చి చక్కగా వివరిస్తూ, వీటి సఫలత కొరకు నేటినుండి తామంతా పాటుబడాలని చెప్పారు. సభ్యులు అన్ని విషయాలు శ్రద్ధగావిని హర్షధ్వానాలు చేస్తూ, మేమంతా తప్పకుండా శ్రీవారి ఆజ్ఞ ప్రకారం తమ అడుగులకు మడుగులొత్తుతూ వుంటామని రాజుగారికి ఏకగ్రీవంగా తమ సమ్మతిని తెలియజేశాయి. ఇందుకు సభాసదులను అభినందిస్తూ గార్దభ మహారాజుగారు ఇల్లా అన్నారు- 'సోదర సభాసదులారా! నేడు నాకు ఎంతో ఆనందమయినది. మీరంతా తమతమ ఆచార వ్యవహారాలద్వారా ఐక్యత శాంతులను తప్పక నెలకొల్పగలరని నా గట్టినమ్మకం. ఇంతేగాక, నూతన యుగాన్ని విలక్షణంగా నిర్మిస్తారని కూడా ఆశిస్తాను. అందు ఏ కరువు కాటకాలు, అల్లకల్లోలాలు, గిల్లికజ్జాలు లేకుండా శాంతి సౌఖ్యాలతో, సుఖసమృద్ధులతో అందరూ కలసికట్టుగా ఒకేపల్లిబిడ్డల్లా ఉంటారనికోరుతున్నాను. నామాటలు మీరంతా అంగీకరించినందుకు మరింత సంతోషపడుతున్నాను. ముందు ముందు మనమంతా ఒకే రకమయిన సంతానం పుట్టించాలి. కోళ్ళలాంటి అమాయకపు జాతి, అందమయిన

జాతి ఇంకొకటి లేదు. కాబట్టి మన భావి సంతానమంతా వాటివలె ఉన్నట్లయితే మన ఐకమత్యం, సామరస్యములు వృద్ధి జెంది, వర్ధిల్లగలవు. ఇందుకు ఏమీ సందేహంలేదు. కాన మహారాజు నయిన నేను మీ అందరికీ ఏ విధమయిన వర్గ భేదాలు గాని, హెచ్చుతగ్గులు గాని లేకుండా_ అష్టాది వర్ణాల వారికీ యిచ్చే ఆదేశము ఏమనగా- మనవారంతా ఇక ముందు వారి వారి పుట్టుబుద్ధులు విడిచి, కోడిగ్రుడ్డుల్లాంటివే పెట్టాలి. ఈ నా ఆదేశాన్ని తు. చ. తప్పకుండా పాలిస్తారని ఆశిస్తున్నాను."

గార్దభరాజుగారి ఆదేశం విన్న పిమ్మట జంతువుల్లో కాస్త కలవరం కలిగింది. కాని వృషభ మహాశయుల వారి వాడి కొమ్ముల సేన నాలుగు వేపులా వున్నది. అందుచేత భయపడి విరోధభావం ప్రకటించడానికి యేవీ సాహసించ లేక పోయినాయి. ఒక చిన్న పిట్ట మాత్రం తన భావాన్ని ప్రకటించ సాహసించి నది. లేచి "రాజాధిరాజా! తమ ఆజ్ఞ శిరోధార్యము. కాని చిన్న మనవి. తమ సేనాపతి అయిన వృషభంగారు తమ సజాతీయుల ద్వారా ఈ ఆజ్ఞను అమలు పరచి, ఇతరులకు ఆదర్శ ప్రాయులు అయినచో బాగుండునని నా ప్రార్థన."

వెంటనే ఆ పిట్టను పట్టి కోర్టుకు తెచ్చారు. తీర్పు కొరకు జ్యూరీ సభ్యులు కూడారు. అంతా కలిసి ఏక కంఠతో క్రింది విధంగా తీర్పుచేశారు— "వృషభ జాతికి గ్రుడ్లు పెట్టే బాధ్యతనుంచి మినహాయింపు యివ్వబడుతున్నది. ఇందుతో బాటు రాజుగారిని అవమానపరచిన ఘోర అపరాధం చేసిందిగాన పిట్టకు ప్రాణ దండన విధింపబడుతున్నది." పిట్ట వెంటనే వధింపబడింది. దానితో మిగతా జంతువులన్నీ కుక్కిన పేనులా వూరుకున్నాయి.

దీనితో గార్దభరాజుగారికి కూడా కాస్త హెచ్చరిక కలిగింది. జాగ్రత పడాలనుకున్నాడు. వెంటనే మంత్రులను పిలిచి, ఆలోచనలు జరిపాడు. నూత నంగా ఇంకొక ఆదేశం చేశాడు. అది ఈ విధంగా ప్రకటించారు- "ఫలానా తేదీ, ఫలానాదినం జరగబోయే స్వాతంత్ర్య మహోత్సవంలో దేశవాసులందరూ తప్పనిసరిగ పాల్గొనవలెను. నాడు జరుగబోవు దర్బారులో కూడా తప్పనిసరిగా

హాజరు కావలెను, దేశంలో ఐకమత్య సాధనలో మేమంతా తీవ్రంగా పాల్గొంటా మనీ, అంతా కోడిగ్రుడ్డుల్లాంటి గ్రుడ్లే పెడతామనీ, నాడు తప్పనిసరిగా ప్రమాణాలు స్వీకరించవలెను."

స్వాతంత్ర్యదినం వచ్చింది. ఉత్సవం ఆరంభమయింది. రాజాజ్ఞప్రకారం దర్బారు కూడా జరిగింది. దర్బారులో రకరకాల జంతువులు, పశువులూ హాజరయ్యాయి. గార్దభమహారాజుగారు సింహాసనంమీద ఆసీనులయినారు. సింహాసనానికి కుడివైపున సేనాపతి వృషభంగారు కూర్చున్నారు. వాడిగల కొమ్ములు, ఎఱ్ఱనికళ్లు, రుసరుసమనే ముఖారవిందముతో నిజంగా ఆయనలో సైనిక కీవి ఉట్టిపడుతున్నది. ఎడమవైపున మంత్రిమహాశయులు మర్కటంగారు కూచున్నారు. మెడలోని రాజపతకాలు ఆయన రాజభక్తిని ప్రకటిస్తున్నాయి. చేతులో పెద్దపేర్ల జాబితా ఉన్నది. దాని ప్రకారం మర్కటంగారు ఒక్కొక్క పేరే పిలుస్తున్నారు.

మొట్టమొదట సింహంపేరు వచ్చింది. సింహం నెమ్మదిగా నెమ్మదిగా భయపడుతూ సింహాసనం దగ్గరకు వెళ్ళింది. దానికి నోట మాట రావటం లేదు. అయినా కాస్త సాహసం కూడగట్టుకుని "ఓ మహారాజా! ఆలోచించడానికి ఇంకా కొంత సమయం కావాలి" అంది. గార్దభమహారాజుగారు అంగీకారం తెలుపుతూ తల వూపాడు. సింహం తనచోటులో నివురుగప్పిన నిప్పులా కూర్చున్నది. తరువాత శునకం పేరు వచ్చింది. సింహాసనంవద్దకు వచ్చి ఇలా అన్నది- "ఓ దయానిధీ, మహారాజా! నాకు కోడిగ్రుడ్డయినా ఒకటే, హంసగ్రుడ్డయినా ఒకటే. కాబట్టి తమ ఆజ్ఞప్రకారం కోడిగ్రుడ్డే పెడతాను. తమకు జయమగుగాక." సేనాపతి వృషభంగారు కొమ్ములు వూపి అంగీకారం తెలియపరచారు. గార్దభరాజుగారు కూడా తమ లంబకర్ణాలు వూపుతూ సమ్మతి ప్రకటించారు. ఇతర అభ్యంతరాలు ఏమీ కలగలేదు. తరువాత చెవులపిల్లి, మేక, ఒంటె మొదలయిన జంతువులువచ్చి శునకంగార్ని అనుకరిస్తూ రాజభక్తిని ప్రకటించి కూర్చున్నాయి.

పిమ్మట నక్కబావగారి వంతు వచ్చింది. అది అతి వినయంతో రాజుకు సాష్టాంగ నమస్కారంచేసి. "తమ ఆదేశానికి నాకు ఎంతో ఆనందం, అభిమానం రెండూ కలుగుతున్నాయి. ఎందుకంటే నా అదృష్టంకొద్దీ నా బొరియలోని గూళ్లన్నీ కోడిగ్రుడ్లతోనే నిండివున్నాయి" అంది. తోడేలుకూడా అలానే చెప్పింది. కాని దానిమాట బహుశః రాజుగారి చెవుల్లోపడలేదు. అన్నిటికంటె వెనక పిట్టల వంతు వచ్చింది. వీటిల్లోమాత్రం కొద్దిగా విరోధం, కలవరం కలిగింది తమరెక్కల సహాయంతో ఎగిరిపోగలమనే ధీమా వాటికి ఉన్నది. పావురాయిలేచి "ఓ మహా రాజులుంగారూ! మేము కోడిగ్రుడ్లు పెట్టాలనేగదా; తమ ఆదేశం? అది మాకు శిరోధార్యం"అని కూర్చున్నవి. కాని హంసకు కొంతకోపం కలిగింది. "కోడిగ్రుడ్డు ల్లాంటివా? అంటే! కోడిగ్రుడ్లే గ్రుడ్లుగాని......హంసగ్రుడ్లు........." అని ఏమేమోచెప్పబోయేసరికి సేనాపతి వృషభంగారు గ్రుడ్లు ఎఱ్ఱజేసి,వాడికొమ్ములు ఊపుకుంటూ హంసమీదికి దుమకబోయారు. వెంటనే హంస ప్లేటుమార్చి, క్షమాపణ కోరుకుంటూ "అయ్యా! నేనుచెప్పేది అదికాదండి, కోడిగ్రుడ్లే పెట్ట డానికి శాయశక్తులా ప్రయత్నిస్తానని అంటున్నానండి"అని కూర్చున్నది, పాపం!

ఆఖరున గరుత్మంతుని పేరు పిలిచి మంత్రి మర్కటంగారు ఆదేశం వినిపించి "నీవుకూడా కోడిగ్రుడ్లే పెడతానని ప్రమాణంచేయి" అన్నాడు. గరుత్మంతుడు ఒక్కసారిగా తన విశాలమైన రెక్కలు సారించి, చురచురమంటూ సభాసదుల్ని చూచేసరికి "వీడు ఏదో హడావుడి చేస్తాడురో" అని సభికుల గుండెల్లో అదురు పుట్టింది. గరుత్మంతుడు మెడ నిగిడించింది. కళ్లు నిప్పులు గ్రక్కుతున్నాయి, ముఖం గంభీరమయింది. "ఇది గరుడజాతికి పూర్తిగ పరాభవం. కోడిజాతి ఎక్కడ! గరుడజాతి ఎక్కడ!! గరుడజాతి కోడిగ్రుడ్లుపెట్టడం అసంభవం. అసం భవం; ఇంతేగాదు మాజాతికి తీరని అవమానం." అని గర్జిస్తూ తిరస్కార భావంతో నలువేపులాచూచి, గరుత్మంతుడు ఒక్కసారిగా ఎగిరిపోయాడు. తన్నెవరూ వెన్నంట లేనంత గగనవీధుల్లోకి ఎగిరిపోయాడు. సూర్యరశ్మిలో దాని తెల్లని రెక్కలు ధగధగ మెరవసాగినాయి గార్దభ మహారాజుగారికి అది చూచేసరికి గుండెలో దడ పుట్టింది.

ఈలోపల సమయం చూచుకుని సింహం లేచింది. "గరుత్మంతుడు చెప్పింది నిజం! నిజం!! ముమ్మాటికి నిజం!!! కోడిగ్రుడ్లు పెట్టడం మా సింహజాతికి అగౌరవం; అవమానకరమూ" అని గాండ్రించి హఠాత్తుగ గార్దభ మహారాజుగారి మీదికి ఉరికింది. తన వాడిగల కోరలతోను, గోళ్ళతోనూ దాని డొక్క చీల్చి పేగులు తీసింది. గార్దభరాజు స్వర్గానికెళ్ళాడు. వృషభ సేనాపతిగారు సేనతోసహా తోకలు ముడుచుకుని తుఱ్ఱోమంది. సింహాన్నెదిరించడానికి గుండెలుంటేగా?

ఇంతకూ గార్దభం గార్దభమే! సింహం సింహమే. నాటినుంచి సింహం మృగరాజు అయింది.



గార్దభరాజును సింహం నేలనేసి నొక్కింది.
దాని డొక్కచీల్చి తన వాడి గోళ్ళతో చంపింది.

ఆఫ్రికాదేశపు కథ:

# అడవిరాజ్యం

సావిత్రీదేవి వర్మా

పూర్వం ఆఫ్రికాదేశంలో ఒక అడవి వుండేది. ఆ అడవిలో ఒక అడవిమనిషి వుండేవాడు. అతనిని 'కికుయూ'అంటారు. ఒకసారి అతడు వేటకుబయలుదేరి తిరుగుతూ తిరుగుతూ వుండగా దూరంగా ఒక ఏనుగు కనిపించింది. దాని వెనక ఇంకా ఏనుగులగుంపు వుండవచ్చునని తలంచాడు. కాని అది ఒక్కటే అని తెలుసుకుని ఆశ్చర్యపడ్డాడు. "ఈ ఏనుగేదో కష్టదశలో వున్నట్లున్నది. వెళ్లి కాస్త అడుగుదాం. పాపం దానికేంకష్టమో?" అనుకున్నాడతను.

ఏనుగుదగ్గరకువెళ్ళి- "నమస్కారమండి ఏనుగ్గారూ! ఏదో విచారంలో వున్నట్లున్నారే, కారణమేమిటో కాస్త తెలవిస్తారా?" అన్నాడు.

ఏనుగు చెప్పింది- "కికుయూ భాయీ! నాగతి ఏమని చెప్పమంటావు! నేనెంతో కష్టదశలోవున్నాను. నాకాకలి యెక్కువ. నా మందలో నాకు కోరిన ఆహారం దొరికేది కాదు; కోరినట్టుగా తిరగలేక పోయేదాన్ని. అందుచేత నా మందకూ నాకూ సరిపడలేదు. ఈ కారణంగా మందను విడిచి ఇలా దేశాంతరం వచ్చేశాను."

కికుయూ "మందను విడిచిపెట్టి చాలా పొరపాటు పనిచేశావు. వంటరిగా యెట్లా వుండగలవు?"

కికుయూమాట వినేసరికి ఏనుగు తనతప్పు తెలిసికొన్నది. కాని అది చాలా తెలివిగలది. "భాయీ! వంటరిగా వుండడమేమి ఖర్మం? నీవున్నావుగా తోడు! మంచిది. నేటినుంచి మనమిద్దరమూ స్నేహితులము. నేను రకరకాలపండ్లు తెచ్చి నీకిస్తూ వుంటాను. నీవు నాకు తోడునీడగా వుంటూ వుండు. ఇదే విధంగా నీ నీడలోనే తిరుగుతుంటాను."

# స్నేహ



కికుయూ వట్టి అమాయకుడు. దాని తియ్యని మాటలు నమ్మినాడు. కొంత కాలానికి సింహరాజు ఏనుగును అడవికి మంత్రిగా చేశాడు. ఇక ఏనుగు దర్జాకు లోటు లేదు, అడ్డూ లేదు.

కికుయూ అప్పుడప్పుడు ఏనుగును నదికి తీసుకెళ్లి కడిగి తీసుకొస్తుండేవాడు. నీటిలో అది పడుకునేది. కికుయూ దాని శరీరం తోమి తోమి కడుగుతుండే వాడు. అప్పుడు దానికి ఎక్కడలేని సుఖం, హాయి కలిగేది. కొంతకాలానికి, ఏనుగు అతి సుకుమారిగా తయారయింది. కికుయూ అప్పుడప్పుడు ఎండవేడికి భయపడి దాన్ని నదికి తీసుకు వెళ్ళలేకపోయేవాడు. ఆ వేళ యేనుగు గుడిసె ముందుకు వచ్చి తొండంతో దుమ్మెత్తి తన వంటినిండా పోసుకునేది. కొంత గాలి కెగరబెట్టేది. అందుచేత గాలికూడా దుమ్ముతో నిండిపోయేది. కికుయూ ఉంగరాల జుట్టుకూడా దుమ్ము మయమే అయిపోయేది. అతడు తనను నదికి తీసుకొని వెళ్ళేటంతవరకు ఏనుగు దుమ్మెత్తి పోస్తూనే వుండేది. ఇది దానికి అలవాటు అయిపోయింది.

ఈవిధంగా ఏనుగు మొండితనం క్రమక్రమంగా మితిమీరిపోసాగింది. కాని కికుయూ మిత్రుడవడంచేత దాన్ని ఏమీ మందలించలేకపోయేవాడు.

ఒకసారి అడవిలో పెద్ద తుపానురేగింది. కొంచెం సేపటికి గాలి దుమ్ము తగ్గి, వడగళ్లు పడడం ఆరంభించాయి. వడగళ్లు తగ్గేసరికి ధారాపాతంగా వాన కురవసాగింది. దీనికి కంగారుపడి ఏనుగు కికుయూ గుడిసెదగ్గరకువచ్చి- "మిత్రమా! నన్ను రక్షించు. ఈ గాలి దుమ్ముతో బేజారెత్తిపోయాను. నీ గుడిసెలో నా తొండానికి కాస్త చోటిస్తే నన్ను రక్షించినవాడవవుతావు. నీకెంతో పుణ్యముంటుంది" అని విన్నవించుకున్నది.

కికుయూకు ఏనుగుమీద దయ గలిగింది- "గజరాజమా! నా కుటీరం చాలా చిన్నది. ఐనా తొండానికి సరిపడేచోటు చేస్తాను. ఏదీ; నెమ్మదిగా లోపలకు రానియి నీతొండాన్ని" అన్నాడు ప్రేమతో.

ఏనుగు తన మిత్రునితో "మిత్రమా! నీ యీ ఉపకార ఋణమెప్పుడైనా తీర్చుకుంటానులే" అని ధన్యవాదాలర్పించుకుంది.



"ఓ మిత్రమా! ఈ గాలిదుమ్మునకు నేను బేజారెత్తిపోయాను. సూదుల్లాంటి వాన జల్లును అతికోమలమైన నా తొండము సహించజాలకున్నది. పాహిమాం, పాహిమాం" అని విన్నవించుకున్నది.

తొండం లోపల పెట్టేసరికి దానికెంతో సుఖం కలిగింది. దానితో ఆశ పెరిగినది. నెమ్మదిగా తల, పిమ్మట పూర్తిగా తానే ప్రవేశించింది ఆ గుడిసె కాస్తా దాని స్థూలకాయానికే సరిపోయింది. పాపం కికుయూకు చోటులేకుండా పోయింది. అతను మరీ అమాయకుడవడంచేత దాన్నేమీ అనలేకపోయాడు. కాని మనసులోమాత్రం- "దీనినే సూదిలావచ్చి దబ్బనంలా వెళ్ళడం అంటారు, ఈ గజరాజు నెమ్మది నెమ్మదిగ గుడిసెనంతా ఆక్రమించింది. దీని పీడ యెట్లా విడిపించుకునేది?" అని ఆలోచించసాగాడు.

కికుయూ ఈవిధంగా ఆలోచిస్తుండగానే గజరాజిట్లా అన్నది- "మిత్రమా! నీ శరీరం ఎండవానలకు అలవాటుపడి వున్నది. కాన కష్టం సహించగలదు. నా సుకుమార శరీరం ఆ వానజల్లు బొత్తిగా సహించలేక పోతున్నది. కాబట్టి నేనిందులో ఉంటాను. నీవు బైటకువెళ్ళు. మన యిద్దరికి యిందులో చోటు సరిపోదు."

గజరాజు మాటలకు కికుయూ కాస్త కష్టపడ్డాడుగాని, అతనూ తనపూరిల్లు విడవదలచుకోలేదు. గజరాజుకు నయాన భయాన కాస్త నచ్చజెప్ప జూచాడు.



చేసినమేలు మరచి, ఏనుగు ఇలా అన్నది- ''మిత్రమా! నీశరీము ఎండ వానలకు రాటుదేరినది. కాబట్టి కష్టము సహించగలదు. నాశరీరము అతి సుకుమారమైనది. కాన రోకళ్లలాంటి వానజల్లు సహించజాలకున్నది. అందువల్ల నేనిందులోనే వుంటాను. నీవు మరొకచోటికి వెళ్లు. మన యిద్దరికి ఇందులో చోటులేదు కూడాను.''

లాభం లేకపోయింది. సరిగదా క్రమక్రమంగా వ్యవహారం ముదిరిపోయింది. వాన తగ్గడంచేత చుట్టుపట్ల మృగాలుకూడా ఈ తమాషా చూడడానికి పోగయి నాయి. వారిద్దరూ నీవెంతంటే నీవెంత అనుకుంటున్నారు. ఇది చూచి అడవి రాజు సింహం వారిని- "ఏమిటి గందరగోళం? ఈ అడవికి నేను రాజునని మీకు తెలియదా? అయితే ఇలా రగడచేయడానికి మీకు ధైర్యము ఎట్లా కలిగింది?" అని గద్దిస్తూ, గజరాజును చూచి ఆశ్చర్యంతో "నీవు అడవికి మంత్రివైయ్యుండి కూడా ఈ తెలివితక్కువలో యెలాపడ్డావు?" అంది.

ఏనుగు, రాజుగారికి వినయంతో నమస్కరించి "మహారాజా! గడబిడ చేసింది నేను కాదండి. ఈ గుడిసెను గురించి మాట్లాడుతున్నాను. గుడిసెలో నేనుంటున్న సంగతి తమకు తెలియనిది కాదు. కాన ఇది నా యధీనములోనే వుండాలని యేలినవారికి మనవి" అన్నది.

కికుయూ కూడా తాను చెప్పదలచుకున్నది ఏదో చెప్పాడు. అంతా విని అడవిరాజు గజరాజుతో "చూడు; నా మంత్రులు దీనికి సంబంధించిన భోగట్టా చేస్తారు. ఆ తరువాతగాని దీని తీర్పు జరగదు." అని ఇటు 'కికుయూ'తో "నీవు చాల బుద్ధిమంతుడవు. నామంత్రి గజరాజుతో స్నేహం చేసుకున్నావు. తొందర పడకు. నీ గుడిసె యెక్కడికిపోదు. పంచాయితీ సభ్యులందరూ కలుసుకుంటారు. అప్పుడు నీ హక్కును పూర్తిగా బలపరచు. నీకు తప్పక న్యాయం కలుగుతుంది" అన్నాడు.

'కికుయూ' చాల అమాయకుడు. అడవిరాజుగారి మాటలు నమ్మేశాడు. నిజంగా పంచాయితీ తీర్పు జరుగుతుందనీ, న్యాయం కలుగుతుందనీ, గుడిసె తనకు దక్కుతుందనీ ఆశించాడు.

మంత్రి గజరాజు, మరికొందరి మంత్రుల సహాయముతో పంచాయితీ ఎన్నికలు ప్రబలంగా జరిగాయి. శ్రీమతి గుంటనక్కగారు పంచాయితీ పెద్దగా ఎన్నుకోబడినారు. శ్రీ చిరుతపులిగారు ఆయనకు సెక్రటరీగా ఎన్నుకోబడ్డారు. ఇతర పెద్దలు అనగా దుప్పి, ఎనుబోతు, ఖడ్గమృగము మొదలైనవి యితర సభ్యులుగా ఎన్నికయినారు.

ఈ పంచాయితీ మెంబర్లను చూడడంతోనే 'కికుయూ'కు కంగారు పుట్టింది. ఈ మెంబర్లలో నా జాతివారు ఒక్కరు గూడా లేరు కాబట్టి నాకేమీ న్యాయము కలుగదని అల్లరి చేయసాగాడు. దీనికి జవాబుగా అతనినిలా ఓదార్చారు. "కంగారు పడవద్దు అబ్బాయి, నీ జాతిలో రాజ్యాచట్టాలు తెలిసిన వారెవరు లేరు గాబట్టి ఎవరినీ ఎన్నుకోలేదు. ఇప్పుడు ఎన్నుకొన్న పెద్దలంతా రాజనీతిలో బాగా ఆరితేరినవారు. అంతేకాదు, దేవుడు కూడా వీళ్ళను ఇందు

కోసమే పుట్టించాడు కూడాను. కాబట్టి పక్షపాతరహితంగానే న్యాయం చేస్తారు. ఈమాత్రము నమ్మకముతో ధైర్యంగా వుండు."

పంచాయితీ ఆరంభమయింది. మొట్టమొదట మాననీయ మంత్రి గజరాజు గారిని పిలిచి 'నీవు చెప్పదలచుకొన్నదేదో స్పష్టపరచమన్నారు. గజరాజు తొండానికి పూలదండలు తగిలించుకొని సగర్వంగా దర్జాగా వచ్చి నిలబడింది. 'కికుయూ' వైపు కాస్త వోరకంటితో చూస్తూ యిలా అంది- "మాననీయ పంచాయితీ సదస్యులారా! తమ అమూల్య కాలాన్ని వ్యర్థము చేయదలచుకోలేదు. నేను చెప్పదలచుకొన్నది కాస్తా కొద్దిలోనే చెప్పుతున్నాను, ఈ 'కికుయూ' గుడిసెలో గాలి దుమ్ము ప్రవేశించి దాన్ని ఎగరగొట్ట ప్రారంభించింది. ఒంటరిగా ఉవడంచేత 'కికుయూ' దాన్ని కాపాడుకోలేక నన్ను కాస్త సహాయపడమని పిలిచాడు. వెంటనే నేనందులో దూరి ఆ గాలిదుమ్మును తరుమగొట్టాను. ఈ విధంగా ఆ గుడిసెను అతనికి దక్కింపజేశాను. తరువాత ఆ ఖాళీస్థలాన్ని నేను ఉపయోగించుకొంటున్నాను. నేను చేసిన ఉపకారం సంగతి మరచిపోయి యిపుడు నన్ను ఆ గుడిసెనుండి వెళ్లగొడుతున్నాడు. ఇందులో నేను చేసిన తప్పేమిటో తమరే తెలవివ్వగలరు."

తరువాత పంచాయితీ సభ్యులు గుంటనక్క, తోడేలు, మొదలైన సాక్షులను పిలిచి అడిగారు. సాక్షులు గజరాజువైపే సాక్షమిచ్చారు. తరువాత 'కికుయూ' వచ్చి గుడిసె నాదని ఏదో చెప్పబోతుండగా, మధ్యలోనే ఆపి "కికుయూ, నీలోకాభిరామాయణము వినటానికి సమయము లేదు. కాబట్టి మేము వేశే ప్రశ్నలకు మాత్రమే ముక్తసరిగా జవాబియ్యి. మిగతా కథ మేము విచారించుకొన్నాములే" అని పంచాయితీ మెంబర్లు అతన్ని ఆదేశించారు.

తీర్పుకు ముందు కాస్త విశ్రాంతికొరకు సభను ఆపుచేసి అంతా బయటికి వెళ్ళారు. అక్కడ పొంచున్న గజరాజుగారు మెంబర్లకు బాగా తినిపించాడు. కాస్త విందారగించిన తరువాత మళ్ళీ లోపలకొచ్చి ఈ విధంగా తీర్పును ప్రకటించారు.

"గజరాజు 'కికుయూ'కి ఆపదకాలములో ఆదుకొన్నమాట నిజము. తన సర్వశక్తులు వినియోగించి గుడిసెలో ఖాళీ జాగాను ఆక్రమించుకొని తుఫానును వెళ్లగొట్టి ఆ స్థలములో తన దీర్ఘకాయముతో ప్రవేశించినదీ నిజమే. కాని కికుయూకి యిది యిష్టము లేక ఆ గజరాజు మీద వృథాగా నేరారోపణం చేశాడు. ఇంతకంటే మరేమి కారణము లేదు. కాబట్టి యిప్పుడు కికుయూతో చెప్పునదేమనగా, ఆ గుడిసె, దానిలోని ఖాళీస్థలము సదుపయోగపర్చడానికిగాను గజరాజుకు విడిచి పెట్టవలెను. ఇందుకు బదులుగా కికుయూకు అడవిలో మరొక చోట యెక్కడైనా గుడిసె వేసికొనుటకు కొంత స్థలము యివ్వబడవలెను. అందుకుగాను అడవిరాజైన సింహముగారి యెడల తాను తన రాజభక్తి ప్రకటించుకొంటు వుండడం చాలా అవసరం."

తీర్పు వినగానే గజరాజు గర్వంతో తన తొండము పైకెత్తి సంతోషం ప్రకటించింది. 'కికుయూ' వైపు "చూచావా? యిక్కడ నోరున్నవారిదే రాజ్య మనే సంగతి యిప్పుడైనా తెలిసిందా" అన్నట్లుగా అసూయతో చూచింది.

పాపము! అడవిమృగాలలో 'కికుయూ' మాట వినేవారెవరు?





గజరాజు అభిమానంతో తొండం, తోక పైకెత్తింది.

జకోస్లవేకియా కథ:

# పో పెల్కా

బ్లదీ మీర్ ఎిల్తనేర్

అనగా అనగా ఒక వూరిలో ఇద్దరు దంపతులుండేవారు. వారికి ఇద్దరు కుమార్తెలున్నారు. పెద్దకుమార్తె పేరు జ్లోబోహా; చిన్నకుమార్తె పేరు పోపెల్కా. 'జ్లోబోహా' అతిగడుసు, తుంటరిని. ఈ పిల్లంటే తల్లికి ఎంతో ప్రేమ. 'పోపెల్కా' సాదువు, అల్పసంతోషిని. తండ్రికి అతి ముద్దు ఈ పిల్లంటే.

ఒకసారి తండ్రి ఇద్దరి కుమార్తెలను పిలిచి 'నేను పట్టణం వెడుతున్నాను. మీకు ఏమేమి బహుమతులు కావాలో చెప్పండి?' అన్నాడు.

'జ్లోబోహా' తనకు మంచి మంచి సిల్కుబట్టలు, మంచి మంచి నగలు, మిఠాయీలు తెమ్మని చెప్పింది. 'పోపెల్కా' "నీకు నచ్చినవి తీసుకురానాన్నా" అన్నది నవ్వుతూ.

తండ్రి పట్టణం వెళ్ళాడు. వస్తువులు కొనుక్కొని తిరిగివస్తుండగా, దారిలో ఒకచోట మూడు కొబ్బరికాయలు కనుపించాయి. అవి ఎంతో అందంగా వున్నాయి. 'పోపెల్కా'కు బాగుంటాయని ఆమూడు కొబ్బరికాయలూ పట్టుకు వచ్చాడు.

ఇంటికి రావడంతోనే 'జ్లోబోహా,' "నాన్నా! నాకేమితెచ్చావు?" అని అడిగింది. తండ్రి ఆమెకోసం తెచ్చిన మంచి మంచి బట్టలు, నగలు, అన్నీ ఆమెకు యిచ్చివేశాడు. తరువాత 'పోపెల్కా'ను పిలిచి "ఇవిగో చిట్టీ! నీకోసం మూడు కొబ్బరికాయలు తెచ్చాను" అని అవి చిన్నమ్మాయికి ఇచ్చాడు. 'పోపెల్కా' అవి చూచుకుని కొండంతగా సంబరపడింది. ఎంతో జాగ్రత్తగా వాటిని పెట్టెలో దాచుకున్నది.

కొన్నిరోజుల తరువాత ఆదేశపు రాజుగారి ఇంటిలో పెద్ద ఉత్సవం జరిగింది. 'జ్లోబోహా' తల్లివద్దకు వచ్చి "అమ్మా, అమ్మా! నేను ఉత్సవానికి వెడతానే" అంది గారాబంగా.

తల్లి- "ఒక్కదానవే వెడతావా? నేనూ వస్తాను, పద. 'పోపెల్కా' ఇంటి పనులు చూస్తుంటుందిలే" అన్నది.

'క్లోబోహా', తల్లి ఉత్సవానికి వెళ్ళారు. 'పోపెల్కా' తనను తీసుకు వెళ్ల నందుకు దిగులుపడింది. ఇంటివద్ద ఏమీ తోచలేదు. ప్రక్కనున్న తోటలోకి వెళ్ళి ఒక చెట్టుకింద ఏడుస్తూ కూచున్నది. ఆ చెట్టుమీద ఒక పావురం ఏడుస్తూన్న అమ్మాయిని చూచి 'పోపెల్కా! ఎందుకు ఏడుస్తున్నావు? ఏడవడం మంచిది కాదు. ఇంటికి వెళ్ళి ఒక కొబ్బరికాయ పగలగొట్టి చూడు. నీవు రాజభవనానికి వెళ్లగలవు." అని చెప్పింది.

ఇలా చెప్పి పావురం ఎగిరి పోయింది. 'పోపెల్కా' ఇంటికి వచ్చి ఒక కొబ్బరికాయ కొట్టి చూచింది. అందులో మాంచి బట్టలు, మాంచి చెప్పులజోడు వున్నాయి. 'పోపెల్కా' కు ఆశ్చర్యం, ఆనందం రెండూకలిగాయి. వెంటనే ఆ బట్టలు కట్టుకుని, ఆ జోడు తొడుక్కుని రాజభవనానికి వెళ్ళింది.



పోపెల్కా కొబ్బరికాయ పగలగొట్టి చూచింది. అందులో ఉల్లిపొరలాంటి సిల్కుదుస్తులు, చక్కని చెప్పులజోడు వున్నాయి. ఎంత ఆశ్చర్యము!

ఉత్సవం గొప్పగా జరుగుతున్నది. అందరూ ఆనందంతో నాట్యంచేస్తున్నారు. 'యరోస్లావ్' అనేరాజు అందమైన "పోపెల్కా"ను చూచి ఆమెతో నాట్యం చేయసాగాడు. కొంతసేపయిన తరువాత 'పోపెల్కా' తో "ఓ సుందరీ? నీపేరేమిటో చెప్పవూ" అన్నాడు.

"శ్రీ యరోస్లావ్! నాపేరు చెప్పను" అని పరుగెత్తి పోయింది, పోపెల్కా.

'క్లోబోహా', తల్లీ ఇంటికి వచ్చేసరికి 'పోపెల్కా' ఇంటివద్ద పనిచేస్తూ కూచుంది. చిన్న కూతురుతో తల్లి- "పోపెల్కా! నీవు చాలా మురికి పిల్లవి. రాజుగారి ఇంటికి ఎంతో అందమయిన పిల్ల వచ్చింది. రాజు దానితోనే నాట్యం చేశాడు" అన్నది.

'పోపెల్కా' మాట్లాడలేదు. మెదలకుండా వూరుకొని రాజుగారిని గురించిన ఆలోచనలో పడిపోయింది.

'పోపెల్కా' వెళ్ళిపోయిన తరువాత అక్కడ రాజు కూడా చింతలో మునిగి పోయాడు. 'ఆ పిల్ల ఎంతో అందమయింది. దాని పేరైనా తెలుసుకోలేక పోయాను. సరేలే! రెండవ ఉత్సవానికి రాకపోతుందా?" అని ఆలోచనలోపడ్డాడు.



యరోస్లావ్ పోపెల్కాను చూచి మోహితుడయి రాత్రంతా ఆమెతోనే నృత్యం చేశాడు.

రెండవ వుత్సవం ఆరంభమయింది. ఈ సారి కూడ 'జ్లోబోహా,'తల్లి ఆ వుత్సవానికి వెళ్ళారు. తరువాత 'పోపెల్కా' రెండో కొబ్బరికాయ కొట్టి చూచింది. వెనకటి దానికంటే ఇందులో మరీ అందమైనబట్టలు, చెప్పులూ వున్నాయి. తొందర తొందరగ తొడుక్కొని 'పోపెల్కా' ఉత్సవానికి వెళ్ళింది. ఈ పర్యాయం ఇదివరకటికంటే అందమయిన చిన్నది వచ్చిందని రాజు మోహితుడయినాడు. ఆ రాత్రంతా ఆ చిన్నదానితోనే నృత్యం చేశాడు. 'పోపెల్కా' తెల్లవారకముందే ఇల్లు చేరుకున్నది. తరువాత తనతల్లి, అక్కగార్లు వచ్చారు, వచ్చీ రావడంతోనే "పోపెల్కా! నీవు చాలామురికి పిల్లవి. ఈసారి ఉత్సవంలోకి మరీ సుందరమైన పిల్లవచ్చింది. రాత్రంతా రాజు దానితోనే నాట్యం చేశాడు. తెల్లవారకముందే ఆపిల్ల వెళ్ళిపోయింది. అప్పటినుంచిరాజు ఎంతో దిగులుగా వున్నాడు. ఇంతకూ ఆచిన్నది ఎవరయినదీ తెలియదు" అనిగొప్పగాచెప్పింది.

కొంతకాలానికి రాజుగారి ఇంటివద్ద మూడవ వుత్సవం ఆరంభమయింది. 'పోపెల్కా' తల్లి అక్కలు యథాప్రకారంగా ముందే ఆ వుత్సవానికి వెళ్ళిపోయారు. 'పోపెల్కా' మూడో కొబ్బరికాయ కొట్టింది. గత రెండుసార్లకంటే అధిక విలువగలవీ, అందమైనవీ బట్టలు, చెప్పులజతా కనుపించాయి. 'పోపెల్కా' అవి తొడుక్కుని రాజభవనానికి వెళ్ళింది.

గత రెండు పర్యాయములకంటే ఎక్కువ అందమైన చిన్నది వచ్చిందని, రాజు ఆమెతోనే రాత్రంతా నృత్యం చేశాడు. నృత్యం చేసి చేసి ఆ అమ్మాయితో "ఓ చిన్నదానా! ఈసారి ఇక్కడే వుండిపో. నీ పేరు ఎందుకు చెప్పవూ?" అన్నాడు రాజు. 'పోపెల్కా' రాజుమాట వినకుండా రివ్వున పారిపోయింది. కాని ఈసారి ఆమె ఎడమకాలి జోడు అక్కడ జారిపోయింది. 'యరోస్లావ్' రాజు ఆ జోడు తీసుకుని భవనంలోకి వెళ్ళిపోయాడు.

రెండవ దినం రాజు, మంత్రి కలిసి ఆ జోడుతో రాజ్యమంతా తిరిగారు. కంటబడిన కన్యలందరికీ ఆ జోడు తొడిగి చూచారు. అది యెవరికీ సరిపోలేదు. ఇంకా 'పోపెల్కా'ను వెదుకుతూ ముందుకు పోతున్నారు. వెళ్ళగా వెళ్ళగా ఒకచోట 'పోపెల్కా' తల్లి వారిద్దరినీ దూరంగా చూచి చిన్నమ్మాయితో "పోపెల్కా! చాటుకు వెళ్ళిపో, రాజుగారు వస్తున్నారు." అన్నది తొందరగా. ఇంతలో రాజు వారిని సమీపించి "వద్దు వద్దు వుండనీ" అని ఆజ్ఞాపించాడు.

తల్లి "కాదండి ప్రభూ! ఈ పిల్ల మురికి పిల్ల. పాదంకూడా ఏనుగు పాదం. 'జ్లోబోహా' పాదం ఎంతో చిన్నది. దానికి ఈ జోడు తప్పకుండా సరిపోతుంది" అంటూ "జ్లోబోహా! ఇటురా? రాజుగారికి చూపించు" అన్నది.

'జ్లోబోహా' కాలికి ఆజోడు సరిపోలేదు. తరువాత 'పోపెల్కా'పాదానికి తొడిగి చూచారు. ఆమె పాదానికి సరిగ్గా సరిపోయింది. అది చూచి రాజు ఇలా అన్నాడు. "ఓ అందమైన చిన్నదానా! నీవు నా భవనానికి రా! నిన్ను నేను ఎంతో ప్రేమిస్తున్నాను" అన్నాడు.



పోపెల్కా రాజుమాట వినకుండా పారిపోయింది. కాని
ఈ సారి ఎడమకాలి జోడు అక్కడ జారిపోయింది.

'పోపెల్లా' సిగ్గుపడుతూ-"అవునండి, నేనుకూడా తమను ప్రేమిస్తున్నాను. తమరిని వివాహం చేసుకోవాలని ఎంతగానో కోరుకుంటున్నాను" అన్నది.

కొన్నిరోజులు గడిచాయి. 'పోపెల్కా' 'యరోస్లావ్' లకు వైభవంగా వివాహం జరిగింది. వారిద్దరూ సాయంత్రం సంతోషంగా పూలతోటలో తిరుగుతున్నారు. మొదట 'పోపెల్కా'కు సలహాయిచ్చిన పావురం ఆ కొత్తదంపతులను చూచి, ఆనందపడుతూ వారిపైన ఆకాశంలో ఎగురుతూ వున్నది.



టిబెట్టుదేశపు కథ:

# దుష్ట సేవకురాలు

గీతా కృష్ణశాస్త్రి

ప్రాచీన కాలములో టిబెట్టులో 'శిగత్సే' అనే పట్టణంలో (ఇదక్కడి పెద్ద పట్టణాల్లో రెండోది.) జంగ్‌పో అనే కోటాధ్యక్షుడు వుండేవాడు. అతనికి భౌతిక జీవితానికి కావలసిన సదుపాయాలన్నీ సమృద్ధిగా వున్నాయి. కాని సంతానము లేదు. ఎల్లప్పుడూ అదే చింతలో మునిగివుండేవాడు. ఆఖరికి అక్కడవుండే పెద్ద లామా (సాధు)ను పిలిచి, అతనికి పూజలుచేయిపలెనని అనుకున్నాడు. అనుకున్న ప్రకారం లామా వచ్చాడు, పూజలు జరిగినయి, వేల కొద్దీ సాంగ్ (అక్కడి రూపాయి)లు ఖర్చయినయి. ఆఖరికి 'చెన్-రే-జీ' (ఆదేశపు దేవత) దయవల్ల ఒక కుమార్తె కలిగింది. కాని విధిని తప్పించలేరు. ఇంటిలోకి ఒక ప్రాణి వచ్చిందిగాని రెండోప్రాణి పోయింది. బిడ్డముఖం చూడకుండానే తల్లి చనిపోయింది. పాపం "జంగ్‌పో" దుఃఖసాగరంలో మునిగిపోయాడు. ఆ పుట్టిన పసికూనే అతనికి పంచప్రాణాలు అయింది. "రింజింగ్-లా" అని ఆ బిడ్డకు ముద్దుపేరు పెట్టుకున్నాడు.

క్రమ క్రమంగా కూతురికి యుక్తవయస్సు వచ్చింది. ఆమెను కాపాడటం తండ్రికి పెద్ద సమస్య అయిపోయింది. రాత్రి పగలు ఈ చింతలోనే వుండేవాడు. ఎక్కడైనా మంచి దాది దొరుకుతుందేమో నని ముప్పతిప్పలు పడ్డాడు. వెతగ్గా వెతగ్గా ఒకచోట దాదిదొరికింది. నిజానికామె అంత మంచి స్వభావముకలది కాదు. కాని మంచిదానివలె నటించింది. 'జంగ్ పో' ఆమె స్వభావానికి సంతోషించి "రింజింగ్-లా"ని ఆమెకు వప్పగించాడు. అప్పటినుంచి ఆ దాది ఆ అమ్మాయి ఒకేచోట వుండడం, ఒకేసారి తినడం, ఒకేసారి తిరగడం జరుగుతున్నాయి.

ఇలా వుండగా ఒక రోజున దాది నదికి నీళ్లకొరకు వెడుతున్నపుడు "రింజింగ్-లా" చూచి నేనూ వెడతానని తండ్రితో మారాముచేసింది. కూతురు గారాలబిడ్డ గాబట్టి తండ్రి వద్దనలేక పోయాడు. అంతేకాదు, చిన్న బంగారుబాల్టీ

యిచ్చి, వెళ్లమన్నాడు. "రింజింగ్-లా' బొట్టి చేత్తో పట్టుకొని గంతులేసుకుంటూ దాది వెనకాలే పరుగెత్తింది. దాదికి అమ్మాయిచేతిలోని బంగారపు బొట్టి చూచే సరికి కన్నుకుట్టింది. నదిదగ్గరకు వెళ్లనిచ్చి అమ్మాయితో దాది "ఇక్కడ ఒక ఆట ఆడుకొని వెడదాము" అంది.

'రింజింగ్-లా' "వద్దు తొందరగా వెళ్ళాలి. 'పా-లా' (తండ్రి) ఎదురు చూస్తుంటాడు." అని చెప్పింది.

దాది పట్టుదలతో "ఊఁహు, నీకు ఎవరు యెదురు చెప్పగలరమ్మా! తొందరగా వెళ్లకపోతే ఏమీ మునిగిపోదులే. నీ తండ్రి నిన్ను గారాబంగా చూస్తాడు. కోప్పడడు. ఇదిగో చూడు! మన బొట్టిలు రెండూ నదిలో వదిలేద్దాం. ఏది మునుగుతుందో, ఏది తేలుతుందో చూద్దాం" అన్నది.

రింజింగ్-లా- "హా! ఇదీ ఒక ఆటే? నా బొట్టి బంగారపుది గాబట్టి మునిగి పోతుంది. నీ బొట్టి కర్రది గాబట్టి తేలిపోతుంది" అంది.

మాయలమారి దాది పెద్ద అనుభవముగల దానివలె "ఆ, చిన్నదానివి నీకు ఏమితెలుసు? లోహపు వస్తువులు, విలువగల వస్తువులూ నీటిలో మునగవు. కర్రవి, తేలికైనవి, చవకవస్తువులు మునిగిపోతాయి. ఎప్పుడైనా చూస్తేగా నీకు తెలియడానికి?" అంది. నిజమే కాబోలునని ఆ అమ్మాయి అంగీకరించింది. రెండు బొట్టిలు నదిలో విడిచిపెట్టారు. వెంటనే బంగారపు బొట్టి మునిగి పోయింది. కర్రబొట్టి తేలిపోయింది. ఏదోవిధంగా కర్రబొట్టిని బైటకు తీసుకో గలిగారుగాని, మునిగిపోయిన బొట్టిని తీసుకోలేకపోయారు. పాపమా అమ్మాయి చేతులు నలుపుకుంటూ ఏడవసాగింది. దాది మనసులో సంతోషిస్తూ తన కర్ర బొట్టతో నీళ్ళు తీసుకొని ఇల్లు చేరుకొన్నది.

దాది ఒంటరిగా రావడంచూచి తండ్రి "రింజింగ్-లా ఏదీ?" అని అడిగాడు.

దాది మూతి విరుచుకుంటూ- "తన బొట్టి పోగొట్టుకుని ఏడుస్తూ కూచున్నది. మీరు కోప్పడుతారని భయపడి రావడంలేదు." అంది.



చూస్తూ చూస్తూ వుండగానే బంగారపు బాల్టీ మునిగిపోయింది. కర్రబాల్టీ తేలిపోయింది. పాపం 'రింజింగ్-లా' చేతులు నలుపుకుంటూ నిలబడింది.

జంగ్‌పో- "తొందరగా వెళ్ళి 'రింజింగ్-లా' ను ఇంటికి రమ్మని చెప్పు బాల్టీ పోతే పోయిందిలే" అన్నాడు. కాని ఈ అబద్ధాలమారి వెళ్ళి ఆ అమ్మాయితో "మీ నాన్న చాల కోపం చేస్తున్నాడు. తొందరగా బాల్టీ తేకపోతే చంపేస్తా నంటున్నాడు" అని చెప్పింది.

పాపం, రింజింగ్-లా- "అయితే యిప్పుడేమి చేయాలి?" అంది వెక్కి-వెక్కి ఏడుస్తూ.

దాది- "మనం ఎక్కడికైనా పారిపోదాం పద. చూడు, నీ బట్టలు నేనూ నా బట్టలు నీవు మార్చుకున్నట్లయితే మనల్ని ఎవరూ గుర్తుపట్టలేరు" అని చెప్పింది. పాపం, అమ్మాయి వొప్పుకున్నది. ఒకరి దుస్తులొకరు మార్చుకున్నారు. కాని తొందరలో మెడలో కట్టిన 'పాగె' (ఒక రకమైన నగ) మార్చుకోవడం మరిచిపోయారు. తరువాత అక్కడినుంచి పారిపోయారు.

వెడుతూ వెడుతూ వుండగా దారిలో కొందరు గొడ్ల కాపర్లు ఎదురయి- "మీరిద్దరూ ఈ విధంగా దుస్తులు ఎందుకు మార్చుకున్నారు?" అని అడిగారు. దాది పెద్ద రాణిగారి వలె నటిస్తూ మాట్లాడలేదు. కళ్లు తిప్పుకుంటూ ముందుకు పోయింది. 'రింజింగ్-లా' ఒక దాసిదానివలె- "మేము దుస్తులు మార్చుకోలేదు. నేను కోటాధ్యక్షుని కూతురినీ కాదు" అంటూ దాది వెనకాలే వెళ్ళింది. మరి కొంతదూరం వెళ్ళేసరికి జమీందారుని గుఱ్ఱాల కాపరులు ఎదురయి, మొదటి లాగే ప్రశ్నించారు. వారిద్దరూ మొదటిలాగే జవాబిచ్చి ముందుకు వెళ్ళారు. వెళ్ళగా వెళ్ళగా ఏ జమీందారుని నౌకర్లయితే దారిలో అడ్డుతగిలారో ఆ జమీందారుని యింటికే చేరుకున్నారు. 'రింజింగ్-లా' జమీందారుని దగ్గరకు వెళ్ళి, "మేమిద్దరము తమ దేవిగారివద్ద పనిచేయడానికి వచ్చాము" అని చెప్పి, అనుమతి కోరింది. వెంటనే జమీందారు అనుమతి యిచ్చాడు. ఆ అనుమతి ప్రకారం వారు అక్కడ పనిచేస్తూ వున్నారు.

ఆ జమీందారుకి ఒకే ఒక కొడుకు ఉన్నాడు. 'నామగ్యాల్' అతని పేరు. చూడగా చూడగా ఒకనాడు అతనికి "ఈ యిద్దరూ దుస్తులు ఎందుకు మార్చుకున్నారా?" అని సందేహం కలిగింది. ఒక రోజు వంటరిగాచూచి 'రింజింగ్‌లా'ను ఈవిషయం అడిగాడు. "సెమూకుశో(రాజ కుమారుడు)! నీవు భ్రమపడుతున్నావు. బట్టలు మార్చుకోవలసిన పని ఏముంది మాకు?" అని జవాబిచ్చింది.

'నామ గ్యాల్'కి ఆ జవాబుతో తృప్తి కలగలేదు. ఇంకా పరీక్షచేయాలనుకున్నాడు. ఒక రోజు "రింజింగ్-లా"ను పిలిచి ఆమె చేతికి కొద్దిగా గొర్రె బొచ్చునిచ్చి, "ఇవిగో ఈయాక్ (ఎద్దులు) పశువుల్ని మేపుకురా, ఈ గొర్రె బొచ్చుకూడా

దారంగా వడుక్కొని రావాలిసుమా?" అన్నాడు. సరేనని 'రింజింగ్-లా' ఎడ్లను తోలుకుపోయింది. వెడుతూ వెడుతూ దారిలో ఒక చెట్టుకొమ్మకు గొర్రె బొచ్చు తగిలించి, కొన్నిరాళ్ళు పరి వొడిలో పోసుకుని వెళ్ళింది. కొంతదూరం వెళ్లి, ఆ రాళ్లను యిటూ అటూ చిమ్మింది. ఇలా చేయడంతోనే యాక్ (పశువులు)లు ఇటు అటు తిరిగి చక్కగ మేస్తున్నాయి. సాయంత్రం కావడంతోనే ఆ అమ్మాయి ఆ రాళ్ళను పోగుచేసింది. వెంటనే పశువులన్నీ ఒకచోట చేరుకున్నాయి. వాటిని ఇంటికి తోలుకొస్తూ దారిలో చెట్టుకొమ్మ మీద పెట్టిన గొర్రెబొచ్చు చూచింది. అది చక్కని దారంగా మారివున్నది. 'రింజింగ్-లా' దాన్ని చక్కని ఉండగా చుట్టిపెట్టు కున్నది.

. రింజింగ్-లా అక్కడ వుండగా ఇక్కడ దాదికి నీళ్లు తోడేపని యివ్వబడి వది. "నామగ్యాలు" ఆమెను ఇంకా పరీక్షచేయాలని, "నీవు బంగారు బాల్టీ తీసు కెళ్ళుతే అందులో గొప్పతనమేమీ లేదు. మావద్ద కూడా కావలసినన్ని గుఱ్ఱాలు లెక్కలేనన్ని పశువులువున్నాయి. మీయింటివద్ద యివన్నీవున్నాయా? మాపా-లా (తండ్రి) బంగారు ఆసనంమీద కూర్చుంటాడు మా మాలా (తల్లి) వెండి ఆసనంమీద కూర్చుంటుంది. నేను ఆలిచిప్ప మీద కూర్చుంటాను. ఎరుగుదువా? మీయింటివద్ద యీమాత్రమన్నా లేవా?" అన్నాడు. పాపం, ఆమె మామూలు పని పాటలు చేసుకునే మనిషి. దానికి ఇవన్నీ ఏంతెలుసు? తెల్లబోయింది. జవాబివ్వలేక పోయింది. ముఖము అటు తిప్పుకుని పనిలో పడిపోయింది. "నామగ్యాల్" నవ్వు కుంటూ వెళ్ళి పోయాడు.

మర్నాడు రింజింగ్-లా పని దాదికి అప్పగించ బడింది. దాది రింజింగ్-లా దగ్గరకువెళ్ళి "అమ్మాయి! నిన్న నీవు గొర్రెబొచ్చుతో చక్కనిదారం తీయడం, పశువులను కడుపునిండా మేపడం యేవిధంగా చేశావో కాస్త చెప్పుదూ?" అని అడిగింది. ఆ అమ్మాయి అన్నికిటుకులూ చక్కగా అరటిపండు వలిచి పెట్టి నట్టుగా చెప్పింది. సరేనని గొర్రెబొచ్చు తీసుకుని, పశువులను పోలానికి తోలుకు పోయింది.

ఇక్కడ రింజింగ్-లాకి నీళ్లుతోడే పని యివ్వబడింది "నామగ్యాల్" ఈమెను కూడా పరీక్ష చేయదలచి నిన్నటిలాగే ప్రశ్నలు వేశాడు. తన గొప్పతనాన్ని పొగుడుకున్నాడు. ఎదుటివార్ని నిరసించాడు. 'రింజింగ్-లా' తన తండ్రిని నిరసించే మాటలు వినలేకపోయింది. కాస్త రోషంతో "ఆ! చెప్పావులే గొప్పతనం, నీ బంగారపు బాల్టీలు, నీ వెండి బాల్టీలు అన్నీ కల్తీలవే, అసలైనది ఒక్కటైనా లేదు. పోనీ గుఱ్ఱాలు, పశువులంటావా? అవికూడా చచ్చు జాతులే. అసలైన జాతిగుఱ్ఱంగాని, పశువుగాని ఒక్కటైనా లేదు. మీవద్ద, బలంగలది ఒక్కటైనా వున్నదా? అన్నీ చచ్చువే దద్దమ్మలాంటివే. ఇదే గాబోలు తమ ఘనత; ఇక మీఅమ్మ నాన్నలు కూర్చునే ఆసనాలంటావా? నీవు స్వయంగా కూర్చునే ఆసనమంటావా? వీటిని చూచి మీరే మురిసిపోవాలి. నీ కేంతెలుసు మాజాంగ్ (జిల్లా)సంగతి? అక్కడ వెండిబంగారాల్లో కంటి నలుసంత కలితీకూడా వుండదు. గుఱ్ఱాలు, పశువులు అన్నీ అసలైన మేలుజాతులవే వుంటాయి. మాంచి బలంగా వుంటాయి. వాటిముందు నిలువలేవు మీగుఱ్ఱాలు, పశువులూనూ. ఈవిధంగా మీకు మాకు పోలికలేదు. తెలుసా?" అన్నది.

"నామగ్యాలు"కి ఈమాటలు వినేసరికి మరల నోరు పెగల్లేదు.

ఇక్కడ ఈవిధంగా వారికి వాదోపవాదాలు జరుగుతున్నాయి. అక్కడ దాది తన పనిలో మునిగివున్నది. "రింజింగ్-లా" చెప్పిన ప్రకారంగానే చేసింది. గొర్రెబొచ్చు చెట్టుకొమ్మకు తగిలించి, తెల్లనివి నల్లనివి కొన్నిరాళ్లు పోగుజేసుకు వెళ్ళింది. వాటిని యిటు అటు చిమ్మింది. ఆ విధంగా పశువులు తిరగనూ లేదు, కడుపునిండా మేయనూలేదు. సాయంత్రం రాళ్ళు పోగుజేసింది. ఆ ప్రకారం పశువులు పోగుపడలేదు. ఎంతో కష్టంమీద వాటిని పోగుచేయ గలిగింది. దారిలో ఉన్నికూడా దారంగా మారలేదు సరిగదా చాలాభాగం గాలికి ఎగిరిపోయింది, ఎంతో శ్రమపడి ఉన్ని పోగుజేసుకుని, బ్రతుకు జీవుడా అని రాత్రికి ఇల్లు చేరగలిగింది.

దాది రావడం చూచి "నామగ్యాల్"సంగతి గ్రహించుకున్నాడు. ఒకసారి మరీ దగ్గరకు వెళ్ళి చూచాడు. దాది తల దుమ్ముతో నిండి వున్నది. మెడలో

'పాగే' కూడా మురికిగావున్నది. తోలుసంచిలో సూదీదారం, రెండుమూడు ఇత్తడినగలు, తగరపు ముత్యాలువున్నాయి. "రింజింగ్-లా"వద్దకు వెళ్లిచూచాడు. ఆమె తలవెంట్రుకలు శుభ్రంగా, మెత్తగా, పట్టుదారాలవలె నిగనిగలాడుతున్నాయి. "పాగే" కూడా చక్కగా మెరుస్తున్నది. అందు మంచి మూలికవున్నది. అందువల్ల అందులోనుంచి మూంచి సువాసన వస్తున్నది. ఆమె సంచిలో పట్టుదారాలు, కొన్ని విలువైన నగలు, ముత్యాలు, రత్నాలు, కొన్ని అమూల్యములయిన నీలాలు కూడా వున్నాయి. "రింజింగ్-లా" కలిగినవారిపిల్ల అని, దాది కేవలం దానిదే అనీ, "నమగ్యాల్" యితర నిదర్శనాలు అక్కర లేకుండానే తెలుసుకోగలిగాడు. "రింజింగ్-లా"వద్దకు వెళ్ళి, తను చేసిన ప్రయోగాలన్నీ చెప్పి 'రింజింగ్-లా'! "నీవు "జంగ్‌పౌ" కుమార్తెవు గాదా? నిజంచెప్పు" అన్నాడు. రింజింగ్-లా మాట్లాడలేదు. "నామగ్యాల్" మాత్రం వూరుకున్నాడా? లేదు. "రింజింగ్-లా" ఆఖరికి ఔనని వొప్పుకుని, "దయచేసి ఇంతకంటె యెక్కువ చెప్పించవద్దు" అని ప్రార్థించింది.

'నామగ్యాల్' ఆమెకు అభయమిస్తూ ఇల్లా చెప్పాడు- "సెమూకుకో' కంగారుపడకు, రేపు ప్రొద్దున్నే మీ యిద్దర్నీ కొండశిఖరం మీద 'గుంపా! (మందిరం) నికి పూజచేయడానికి పంపుతాను. మీకు రెండు గుఱ్ఱాలనిస్తాను. ఆ గుఱ్ఱాలు ఎంతో తెలివయినవి. చెప్పకుండానే అన్నిపనులు చేస్తాయి. మందిరం దగ్గరకువెళ్లి గుఱ్ఱాలను చెట్టుకు కట్టవద్దు, మీ మీ కాళ్ళకే కట్టుకోండి. నీసంచిలో కొన్ని తినుబండారాలు వుంటాయి. దాది సంచిలో కౌంజుపిట్టలు ఉంటాయి. నీవు అక్కడ ఏవిధంగానైనా మొదట దాది సంచి తెరిచేటట్టుగాచేయి. సంచి తెరవగానే కౌంజుపిట్టలు 'తుర్రు' మని ఎగిరిపోతాయి. ఆ ధ్వనికి దాది గుఱ్ఱం బెదిరి, దాదిని ఈడ్చుకుంటూ పరుగెత్తిపోతుంది. ఆ పాపిష్టిముండ దాది తన ఖర్మఫలమును అనుభవిస్తుంది. నీ గుఱ్ఱం అక్కడే నిలబడి ఉంటుంది. తరువాత నీవు హాయిగ భోజనముచేసి గుఱ్ఱంమీద యింటికిరా." రింజింగ్-లా సరేనని వొప్పుకున్నది.

మరునాడు ప్రొద్దున్నే ఇద్దరూ రెండు మంచి గుఱ్ఱాలమీద పూజచేయడానికని కొండశిఖరం మీద మందిరానికి వెళ్ళారు. ఇద్దరూ గుఱ్ఱాల కళ్ళేలు తమతమ కాళ్ళకు కట్టుకున్నారు. పూజాపునస్కారాలయి పోయిన తరువాత దాది "రింజింగ్-లా"ను సంచి తెరవమన్నది. 'రింజింగ్-లా' "ఇదేమిటి? బీదదాన్ని. నా సంచిలో పేలాలపిండి ఉన్నది. నీవు శ్రీమతి సెమూకుశోవుగా, నీ సంచిలో మంచిమంచి పదార్థాలుంటాయి. కనక నీసంచే మొదట తెరవాలి" అంద.



సేవకులాలి గుఱ్ఱం బెదిరి కాలికి బుద్ధిచెప్పింది. అంతేకాదు. సేవకురాలిని కూడ ఈడ్చుకెళ్ళి రాతికి, రప్పకి వేసికొట్టింది.

దాది తనసంచి తెరిచింది. తెరవడమే తడవుగా అందులో నుంచి కౌంజుపిట్టలు 'తుఱ్ఱు' మని శబ్దంచేస్తూ యెగిరిపోయినాయి. ఆశబ్దానికి గుఱ్ఱం బెదిరి కాలికి బుద్ధిచెప్పింది. గుఱ్ఱం పారిపోతూ దాదిని కూడా లాక్కుపోయింది. ఆ వేగంలో రాయికీ రప్పకీ తగలడంచేత దాది శరీరం ముక్కలు ముక్కలుగా చీలిపోయింది. ఈవిధంగా ఆ దుష్టదాది జీవితం అంతమయిపోయింది. 'రింజింగ్-లా' హాయిగ భోజనంచేసి తన గుఱ్ఱాన్ని ఎక్కి యిల్లుచేరుకున్నది.

ఇంటికొచ్చిన తరువాత నామగ్యాల్ "ఏమయిందని?" అడిగాడు. 'రింజింగ్-లా' ''దాది ముక్కముక్కలుగా అయి చచ్చిపోయింది. ఆ ముక్కలు జొన్నగింజలంత పెద్దవిగానూ లేవు, ఆవగింజలంత చిన్నవిగానూ లేవు'' అని చెప్పింది. "నామగ్యాల్" సంతోషించాడు.

'నామగ్యాల్' "రింజింగ్-లా"లకు వైభవంగా పెండ్లి జరిగింది. తరువాత 'నామగ్యాల్' తండ్రి బంగారు ఆసనంమీద, తల్లి వెండి ఆసనంమీద; నామగ్యాల్ ఆలి చిప్ప ఆసనంమీద, 'రింజింగ్-లా' నీలాల ఆసనంమీద ఆసీనులయి సుఖంగా వున్నారు.



యూనానీ కథ:

# శిల్పి కొడుకు

ద్రోణవీర్

ఒకానొక రాజ్యంలో ఒక నవాబుండేవాడు. అతడు తనరాజ్యంలో పప్పు మీద వుప్పు మీదా కూడా అన్యాయంగా పన్నులు వేసీ, పరిసరంలో వున్న రాజ్యాలను దోచుకునీ, కొల్లలుగ ధనం గడించాడనీ, దాన్ని భద్రంగా దాచి పెట్టడానికి రాతిగోడలతో రహస్యమైనా ఖజానా కట్టించదలచుకున్నాడనీ, ప్రజల్లో వదంతి వ్యాపించింది.

ఆ నవాబు రాజ్యంలో మంచి శిల్పి ఒకడు వుండేవాడు. నవాబును గురించీ, అతని నిర్ణయాన్ని గురించీ విన్నప్పటినుంచీ అతన్నొకచింత బాధిస్తూవుండేది. రాత్రీ పగలూ అదేచింతలో వుండేవాడు. "ఏదోవిధంగా నే నా ధనం దొంగిలించి పేదసాదలకు పంచిపెట్టాలి "అనుకునేవాడతను. అదృష్టంకొద్దీ ఆ ఖజానా కట్టించే భారం అతని మీద నేపడింది. ఇక అతనికి కొండెక్కినంత సంతోషమయింది.

నవాబుగారి హుకుం కావడం తోటే ఖజానా కట్టే పని ఆరంభమయింది. రాత్రనక పగలనక ముమ్మరంగా పని జరగసాగింది. ఈ లోపల శిల్పి గోడలో ఎవరికీ తెలియనిచోట ఒక పెద్ద రాతిబండను కావలసినప్పుడు ఒకరిద్దరు మనుష్యులు తేలికగా తీసేటట్టు, మరల యథాప్రకారంగా అతికించేటట్టూ అమర్చాడు. కడకు ఖజానా పని పూర్తి అయిపోయింది. నవాబుగారి ధనమంతా అందులో భద్రంగా పెట్టబడింది.

దురదృష్టంకొద్దీ ఆ ఖజానా పూర్తయిన కొన్నిదినాలకే ఆ శిల్పికి పెద్ద జబ్బుచేసింది. ఇక బ్రతకనని భయపడ్డాడు. అందుచేత తన ఇద్దరి కొడుకుల్నీ పిలిచి ఖజానా గోడలో తాను అమర్చిన రాతిబండ రహస్యం వారికి వివరంగాచెప్పాడు. ఇంకా వార్ని సంబోధించి- "అబ్బాయిలూ! దేశంలోని పేద ప్రజల కోసమే

నేనీ పని చేశాను. కాబట్టి ఆ ధనం దేశంకోసం, పేద ప్రజలకోసమే వినియోగించాలి సుమా! ఈ రహస్యం, యితరుల చెవిలో పడనీయరాదు'' అని ప్రాణం విడిచాడు.

శిల్పి కుమాళ్ళు తండ్రి చనిపోయిన తరువాత అతడు తెలిపిన వుపాయాన్ని తమ సొంతలాభానికే ఉపయోగించదలచారు. ఆ ఉద్దేశ్యంతో ఒకనాటి రాత్రి రాజుగారి ఖజానాలో ప్రవేశించి, వెదికివెదికి తండ్రిచెప్పిన రహస్యస్థలం కనుక్కొన



వారిద్దరూ మోయగలిగినంత ధనం తీసుకుని బైటకొచ్చి రాతి బండను యథాస్థానంలో అతికించి, నరునికంట బడకుండా ఇల్లు చేరారు.

గలిగారు. తరువాత ధనరాశిని చూడగలిగారు. ధనరాశిని చూడడంతో వారి సంతోషం ఇంతా అంతా అని చెప్పడానికి వీలులేకపోయింది. తీసుకోగలిగినంత ధనం తీసుకుని, ఆ రాతిని యథాప్రకారంగా అతికించి, ఏ విధంగానైతేనేమి యెవరి కంట బడకుండా ఇల్లు చేరుకున్నారు.

మరునాడు నవాబు ఖజానాలోకి వెళ్ళి చూసేసరికి ధనరాసులు చిందర వందరగా కనుపించాయి. అదిచూచి నవాబు సందేహపడ్డాడు. సిపాయిలను పిలిపించి నలువేపులా వెతికించాడు. ఎక్కడా కన్నం వేసిన గుర్తులు కనుపించ లేదు. ప్రయత్నించి ప్రయత్నించి ఆఖరుకు నవాబు నిరాశచెంది వూరుకున్నాడు.

రెండోదినం వెళ్ళి చూడగా ధనరాసులు మరల చిందర వందరగానే కనిపించాయి. దీనితో నవాబు అనుమానం మరింత పెరిగిపోయింది. ఆఖరికి ధన రాసుల చుట్టూ ఉచ్చులు పన్నించాడు. ఈ సారి ధనం దొంగిలించేవారు ఈ ఉచ్చుల్లో చిక్కుకుంటారని అతని ఉద్దేశం.

తర్వాతి రోజు రాత్రి శిల్పికొడుకులు యథాప్రకారం కావలావాళ్ళ నందర్నీ తప్పించుకుని ఖజానాలో ప్రవేశించారు. ఉచ్చులసంగతి వారికి తెలియ నందువల్ల, వెళ్ళి వెళ్ళడంతోనే పెద్దవాడు ఆ ఉచ్చులో చిక్కుకుపోయాడు. తప్పించుకోడానికి చేయగలిగినన్ని యత్నాలుచేశారు. కాని లాభం లేకపోయింది. ఆఖరికి చిక్కుపడ్డవాడు తన తమ్ముడితో "తమ్ముడూ! నేను ప్రాణాలతో పట్టుబడితినా పిమ్మట మీరందరూ పట్టుబడిపోతారు. కనుక నాతల నరికి తీసుకు వెళ్ళు. నా మొండాన్ని ఎవరూ గుర్తుపట్టలేరులే" అన్నాడు.

అన్న చెప్పిన ప్రకారమే తమ్ముడు అన్న తల నరికి ఇంటికి తీసుకువెళ్లాడు.

తెల్లవారగానే నవాబు ఖజానా చూడడానికి వెళ్ళాడు. ధనరాశి దగ్గర తల లేని మొండాన్ని చూచి ఆశ్చర్యచకితుడయినాడు. నాలుగు వైపులా పరికించి చూచాడు. కన్నంవేసిన గుర్తుగాని, మరేవిధమైన గుర్తులు గాని కనిపించ లేదు. ఆఖరికి యేమయినా సరే ఆ మొండెం జాడ తెలుసుకోవాలనుకున్నాడు. "ఈ మొండాన్ని నడివీధిలో వేలాడ గట్టమని, ఈ శవాన్ని జూచి యేడ్చినవారి నందరిని పట్టుకుని సంకెళ్ళు వేయమని" సిపాయిలకు హుకుం జారీచేశాడు.

శిల్పి భార్యకు ఈ సంగతి తెలిసి గుండెలవిసిపోయేటంతగా యేడ్చింది. యేడ్చి యేడ్చి రెండో కుమారునితో "నాయనా! ఏ విధంగానయినా సరే, ఆ శవాన్ని ఇంటికి తీసుకురా" అన్నది. కుమారుడుకూడా శవాన్ని ఇంటికి తీసుకు వెళ్ళాలని అనేక ఎత్తులు వేశాడు. పన్నుగడలు పన్నాడు కాని యేమీ ఫలితం లేకపోయింది. అయినా అతడు పట్టిన పట్టు వదిలేవాడుకాడు.

ఆఖరికి శిల్పికొడుకు మంచి వుపాయం పన్నాడు. సుమారు పాతిక ముప్ఫయి గాడిదలమీద సారాతో నింపిన తోలుసంచులు వేయించి, వాటిని అన్న గారి శవం చుట్టూ తిప్పసాగాడు. మధ్యలో సంచుల మూతులు కాస్త వొదులు చేయించాడు. సారా అంతా క్రింద వొలకసాగింది. ఇది చూచి లబో లబో మని యేడుస్తూ "నా జీవనాధారమైన సారా పోయిందే, నా బిడ్డల నోటివద్ద కూడు పోయిందే. నేనేమి చేయను, భగవంతుడా!" అని పెద్దగా గోలచేయడం మొదలు పెట్టాడు. శవం వద్ద కాపలావున్న సిపాయిలందరూ వూరికే వస్తుందిగదా అని ఆ సారాయిని మత్తెక్కేలాగ త్రాగేరు. తరువాత శిల్పికొడుకు తలచినట్లుగానే సారా మత్తులో వళ్ళు తెలియకుండా పడిపోయినారు. చీకటి పడేటంతవరకూ అక్కడే నటనచేస్తూ వుండి, చీకటిపడిన పిమ్మట ఎవరికీ తెలియకుండా ఆ శవాన్ని ఎత్తుకుపోయాడు. ఇంటివద్ద తల్లికి కొడుకు శవాన్ని చూచేటప్పటికి ప్రాణం లేచొచ్చినట్లయినది.

మరునాడు ఉదయమే ఈ వార్త నవాబుకు తెలిసింది. వెంటనే ఆయన పడ్డ ఆశ్చర్యానికి మేర లేకపోయింది. అతడూ సామాన్యమైన నవాబు గాదు. దొంగను పట్టుకోడానికి మరొక యుక్తి పన్నాడు. రాజ్యంలో ఈ విధంగా చాటింపు వేయించాడు. "నా రాజ్యంలో ఎవరైతే అతి ఉత్తమము, అతి ఆశ్చర్య కరము అయిన జీవిత సంఘటనను నాకుమార్తెకు వినిపిస్తారో వారికి నాకుమార్తె నిచ్చి వివాహం చేస్తాను". ఇది కూడా ఒక పన్నుగడే.

శిల్పికొడుకు ఆ చాటింపు విన్నాడు. వెంటనే అసలుసంగతి గ్రహించాడు. అయినా నవాబుకు మరొక చేయి చూపించాలనుకున్నాడు. ఒకరాత్రి ఒక

చచ్చినమనిషి బుజాన్ని బట్టలో కప్పి పుచ్చుకొని శహజాదీ (నవాబు కూతురు) దగ్గరకు వెళ్ళాడు. శాహజాదీ ప్రశ్నించేసరికి జవాబుగా తన అన్న ఖజానాలో



అర్ధరాత్రి వేళ యెవరూ చూడకుండా అన్న శవాన్ని
గాడిద మీద యిల్లు చేర్చాడు.

చిక్కుకున్నప్పటి నుంచి నాటివరకు జరిగిన కథ పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. ఈ కథ విన్నతరువాత "అమ్మయ్యో! దొరికాడురా దొంగ" అని శాహజాది అతని బుజాన్ని పట్టుకోబోయింది. శిల్పికొడుకు ఆ బుజమును ఆమెకు విడిచిపెట్టి, చీకటి చీకటిలో బైటకు జారిపోయాడు.

నవాబుకు ఈ కబురు తెలిసింది. ఆయనకు కోపం, ఆశ్చర్యం రెండూ కలిగేయి. అయినా మరొక చాటింపు చేయించాడు- "నా రాజ్యంలో ఇంత చాకచక్యంగలిగిన దొంగ యెవరో స్వయముగావచ్చి, చేసిన పని జరిగింది జరిగినట్లు నిజం చెప్పినయెడల అతనిని క్షమించివేయుదును."

శిల్పి కుమారుడు ఇదే మంచి తరుణమనుకుని దర్బారులో హాజరయి, జరిగినదంతా చెప్పేశాడు. నవాబు అతని చాకచక్యానికి, సాహసానికి మెచ్చుకుని తాను చేసిన వాగ్దానం ప్రకారంగా శిల్పి కుమారునికి తన కూతురునిచ్చి వివాహము చేశాడు.



టిబెట్టుదేశపు కథ:

# వరాలనిచ్చు శునకము

గీతాకృష్ణశాస్త్రీ



జలరాజు అతనికి ఒక కుక్కనిచ్చి "ఓ-పా-బే (అక్కడి దేవత) పేరుమీద దుఃఖాన్ని మరచిపోయి యీకుక్కను తీసుకో! కాని ఈ కుక్కకు మాత్రము ముందు అన్నంపెట్టి తరువాత నీవు తినాలి." అన్నాడు.

పూర్వం టిబెట్టుదేశంలో 'ఖమ్' అనే ప్రాంతం ఉండేది. ఆ ప్రాంతంలో 'చైవాంగ్' అనే కుర్రవాడు ఒకడుండేవాడు. సవతితల్లి అతన్ని సరిగా చూచెడిది కాదు. తాను నెయ్యి, పప్పు, కూరలతో హాయిగా అన్నం తింటూ, ఆ అబ్బాయికి జొన్న అంబలి పోసేది. విలువయిన చీని చీనాంబరాలు తాను

ధరిస్తూ, చినిగిపోయిన గుడ్డ పేలికలు ఆ అబ్బాయికి ఇస్తుండేది. దీనికి తోడు అతనిచేత పనిపాటులు దండిగా చేయించేది. గొడ్ల చావిడి వూడవడం, పుల్లలు ఏరుకు రావడం, పొయిలో నిప్పు వేయడం, పాలు పితకడం, పశువులను మేపడం అన్నిపనులూ పాపం, ఆ కుర్రాడే చేయవలసివచ్చేది. అందుచేత విసుగుచెంది, బ్రతుకే వ్యర్థమనుకుని నిరాశ జెందాడు. ఒకనాడు వూరుబయట చెరువుగట్టుకు వెళ్ళి ఏడుస్తూ కూచున్నాడు.

దీనమైన అతని ఏడ్పు విని చెరువులోనుంచి ఆ చెరువురాజుగారి న్యేర్సా (ధనరక్షకుడు) పైకి వచ్చి అతన్ని "ఎందుకు ఏడుస్తున్నావు, అబ్బాయీ?" అని ప్రశ్నించాడు. 'చైవాంగ్' "నా ఖర్మానికి ఏడుస్తున్నాను, బాబూ!, ప్రొద్దున్న లేచింది మొదలు రాత్రి పడుకునేటంతవరకు చచ్చేటట్టుగా అన్ని పనులూ చేయాలి. బదులుగా తినడానికింత జొన్నఅంబలి, కట్టుకోడానికిన్ని చింపిరి గుడ్డలు దొరుకుతాయి. ఇది బాబు, నా బ్రతుకు! ఇందుకే ఏడుస్తున్నాను" అని తన దుఃఖం వెళ్ళబోసుకున్నాడు.

ఆ అబ్బాయిని ఓదారుస్తూ 'న్యేర్సా' ఇలా చెప్పాడు.- "ఫర్వాలేదులే, అధైర్య పడకు. జలరాజు గారి వద్దకు తీసుకువెళ్ళుతాను, రా! కళ్ళుమూసుకో. మరల నేను చెప్పేటంతవరకు కళ్ళు తెరువవద్దు సుమా?" 'చైవాంగ్' ఒప్పుకున్నాడు. ఇద్దరూ చెరువు లోపలి భాగానికి వెళ్ళిపోయారు. 'న్యేర్సా' చెప్పగా "చైవాంగ్" కళ్లు తెరచాడు. అదొక దివ్య దృశ్యము. దాని వైభవం చూచి అతడు ఆశ్చర్యపడ్డాడు. కళ్లు మిరిమిట్లు గొలిపాయి. ఒకసారి కళ్లు నలుపుకుని తెరిచాడు. జలరాజు అతనిముందు నిలబడ్డాడు. "ఎందుకు ఏడుస్తున్నావు అబ్బాయీ?" అని అడిగాడు. అబ్బాయి మొదటినుంచి తన కథను విన్నవించుకున్నాడు. కథ విని రాజు అతనికొక కుక్కను ఇచ్చి "ఓ-పా-భే" (టిబెట్టు దేవత) పేరు మీద నీ దుఃఖం మరచిపో. ఇదిగో ఈ కుక్కను తీసుకువెళ్ళు. ఇది నీకు మేలు చేయగలదు. కాని ఒక మాట మరువరాదు. ముందు దీనికి అన్నం పెట్టిన తరువాతనే నీవు తినాలి సుమా!" అని హెచ్చరించాడు.

తరువాత 'న్యేర్పా' కళ్ళుమూసుకొమ్మనగానే అబ్బాయి కళ్ళు మూసుకున్నాడు. తెరువమనగానే కళ్ళుతెరిచాడు. ఇంతలో పూర్వంవలెనే చెరువుగట్టు మీదకు వచ్చేశాడు. చైవాంగ్ అక్కడినుంచి ఆ కుక్కతో ఇల్లు చేరుకున్నాడు. కాని మొదటిదినమే కుక్కకు అన్నం పెట్టడం మరచిపోయి, తాను ముందు తిన్నాడు. తరువాత కాసిని మెతుకులు దానికివేశాడు. అందువల్ల ఆ కుక్క మాయమైపోయింది. ఆ అబ్బాయి మళ్ళీ చెరువుగట్టుకు వెళ్ళి ఏడుపు మొదలు పెట్టాడు.

'న్యేర్పా' మరల పైకివచ్చి' ఏం? మరల ఏమికష్టం కలిగింది?' అని అడిగాడు.

"చైవాంగ్ రాజుగారు చెప్పినమాటలు మరచిపోయాను. నేను ముందు అన్నంతిని తరువాత కుక్కకుపెట్టాను.అందుకే గాబోలు అది మాయమైపోయింది. నేనిలా వచ్చాను." అని జవాబిచ్చాడు.

'న్యేర్పా' కళ్లు మూసుకొమ్మన్నాడు. చైవాంగ్ కళ్లు మూసుకున్నాడు. తెరువమన్నాడు, తెరిచాడు. ఇంతలో రాజు ఎదురుగా నిలచాడు. "ఎందుకు ఏడుస్తున్నావు?" అన్నాడు. చైవాంగ్ యిదివరలానే జరిగిన కథ విన్నవించుకున్నాడు. మరల ఇంకో కుక్కనిచ్చి రాజు "ఇదిగో కుక్క. తీసుకువెళ్ళు! ఈ సారి పొరపాటు చేయరాదు సుమా? ఇది ఆఖరిసారి" అన్నాడు.

చైవాంగ్ కుక్కను తీసుకుని ఇల్లు చేరాడు. నాటినుండి ముందు దానికి అన్నంపెట్టి తరువాత తాను తినేవాడు. యాక్(పశువులను)లను మేపునప్పుడూ, ఇంటివద్ద పనిచేసేటప్పుడూ కుక్క అతని వెంట వుంటూవుండేది. దానిమూలంగా అతనికి కావలసిన వస్తువులు లభిస్తుండేవి. తినదలచుకున్న పదార్థాలు తినేవాడు; కట్టదలచుకున్న విలువగల దుస్తులు ధరించేవాడు. ఇలానే తను కోరిందల్లా అవలీలగా పొందుతుండేవాడు. ఈ విధంగా ఆ కుక్కే అతని కామధేనువు అయిందన్నమాట. ఇదంతా చూస్తూవుండే సవతితల్లికి వింతగా తోచింది. "ఈ అబ్బాయికి యివన్నీ యెక్కడినుంచి వస్తున్నయ్యా!అని లోలోపల తర్కించుకోసాగింది. ఈ రహస్యం కనిపెట్టాలని ఒక రోజున ఆ అబ్బాయిని ఇంటివద్ద వుంచి, తాను స్వయంగా పశువులతో పొలం పోయింది.

ఈ కుక్క వచ్చినప్పటి నుంచి అతని కేమీ లోటు జరగడం లేదు. కావాలనుకునే ప్రతివస్తువూ, పదార్థమూ వెంటనే దొరుకుతున్నాయి. 'ఇంతకూ ఇవి ఎల్లా వస్తున్నాయో? ఎక్కడి నుంచి వస్తున్నాయో?' అని అతనికే ఆశ్చర్యం కలిగింది. ఒకనాడు కుక్కరహస్యం తెలుసుకోదలచి 'చైవాంగ్' పైన రహస్యంగా కూచుని చూడసాగాడు. నిజానికది కుక్క కాదు. కుక్క రూపంలోవున్న ఓచక్కని సుందరి. ఆ సుందరి తొందర తొందరగా తన కుక్కచర్మము ఒకచోట పెట్టి పనిలో లీనమైపోయింది. పేడతో నేల అలికి అరచేతితో నేలను నెమ్మదిగా చరిచేసరికి పంచభక్ష్య పరమాన్నాలతో నిండిన పళ్ళాలు ఒకటి తరువాత ఒకటి వచ్చి చేరుతున్నాయి. పైనుండి చూస్తున్న 'చైవాంగ్' తొందర తొందరగా దిగివచ్చి, ఆ కుక్కచర్మాన్ని మంటలోవేసి కాల్చేశాడు. అలా చేయకపోతే ఆ సుందరి మరల కుక్కయిపోతుందని అతని భయం. చర్మం కాల్చవద్దని ఆ సుందరి ఎంతో బ్రతిమాలింది. కాని చైవాంగ్ వినిపించుకోలేదు.



కుక్క తన శరీరం విడచి, చక్కని చుక్కలా మారింది. వెంటనే తన పని ఆరంభించింది. ఇది అతడు చూచాడు.

అంతవరకూ బాగానే జరిగింది. కాని చైవాంగ్‌కి అప్పటినుంచి ఓ కొత్త చిక్కు వచ్చింది. కోటాధ్యక్షుని కుమారుడు ఆ సుందరిని చూస్తే ఆమెను తన భార్యగాచేసుకుంటాడేమోనన్న భయం అతన్ని బాధించసాగింది. ఆభయాన్నుంచి

తప్పించుకోవాలని ఆ సుందరి ముఖానికి మసిపూసివుంచాడు. ఇలా కొన్నిదినాలు గడిచాయి. క్రమ క్రమంగా చైవాంగ్ ధనవంతుడయినాడు. అతడు మొదటి నుండీ ఆ సుందరి అందానికి ఎంతో గర్వపడుతూ వుండేవాడు. ఇప్పుడు ఆ నల్లని మొఖం అతనికి నచ్చడంలేదు. కాబట్టి మసి కడిగివేసినాడు. ఆ సుందరి అందంమీద తనకుండే గౌరవంకొద్దీ ఆమెనుబోలిన ప్రతిమలను అనేకం చేయించి దారికొకటి చొప్పున నిలబెట్టించాడు.

ఆఖరికి చైవాంగ్‌కు అందముపట్లవున్న అభిమానమే అతనికి ముప్పుతెచ్చింది. కోటాధ్యక్షుని కుమారుడు షికారుకు వెళ్ళినప్పుడల్లా ఆ సుందర ప్రతిమలనుచూచి మోహితుడవుతుండేవాడు. కడకు ఆ పోలికగల సుందరిని చేబట్టాలని ప్రతిన బూనాడు. తన గూఢచారులద్వారా జాడ తీయించి, ఏదో విధంగా ఆ సుందరిని వశపరచుకున్నాడు.

చైవాంగ్‌కు మితిలేని కోపం కలిగింది. కోటాధ్యక్షుని మీద కక్ష కట్టాడు. ధనబలంతో ప్రజలను తన పక్షం చేసుకోవాలనుకున్నాడు. కాని "తాదలచిందొకటైతే దైవంతలచింది వేరొకటి" అన్నట్లయింది. కాస్త ధనానికి ఆశపడి కోటాధ్యక్షుని విరోధిగా చేసుకోడానికి ప్రజలు యెవరూ అంగీకరించలేదు. చైవాంగ్ ధైర్యం కోలుపోయాడు. మరల అదే చెరువుగట్టుకు చేరి ఏడుస్తూ కూచున్నాడు.

ఏడ్పువిని మరల "న్యేర్వా" గట్టుకువచ్చి "మరల ఏంకష్టం కలిగింది?" అని అడిగాడు. "రాజుగారిచ్చిన కుక్క తనరూపం విడిచి అపూర్వసుందరిగా మారిపోయింది. ఆ సుందరిని చూచి మోహితుడయి కోటాధ్యక్షుని కుమారుడు బలవంతంగా లాక్కుపోయాడు" అని చైవాంగ్ చెప్పాడు. న్యేర్వా మొదటిలాగానే చైవాంగ్‌ను తనరాజుగారి వద్దకు తీసుకువెళ్ళాడు. రాజుగారు "కళ్లవెంట నీళ్ళు కారుస్తున్నావు ఎందుకు?" అని అడిగారు. చైవాంగ్ యిదివరలాగే తనకథ విన్నవించుకుని, సైన్యం కావాలన్నాడు. డబ్బా ఒకటి చేతికిచ్చి రాజుగారు "ఇదిగో ఈ డబ్బా తీసుకో; నీకు కావలసినంత సైన్యం ఈ డబ్బాలోనుంచి వస్తుంది. యుద్ధ భూమికి తీసుకెళ్ళు, దీని మూతతీసి "కొట్టాలి" అను; ఇంకోచిన్న బుడ్డికూడా

యిచ్చి దీన్ని యెత్తయిన కొండమీదికి తీసుకెళ్ళి, మూత తెరచి ముంచెయ్యాలి, అను" అని చెప్పారు. చైవాంగ్ డబ్బా, బుడ్డి తీసుకొని ఇంటికివచ్చి కోటాధ్యక్షుని కుమారునికి ఈ విధంగా కబురంపాడు- "సాధ్యమైనంత తొందరగా నాసుందరిని నాకిచ్చివేయ వలసినది, లేనియెడల నీమీద దాడిచేస్తాను."

ఈ కబురు వినగానే కోటాధ్యక్షుని కుమారుడు వేలకొలది సైనికులను అస్త్ర శస్త్రాలతో చైవాంగ్ మీ ది కి యుద్ధానికి పంపించాడు. చైవాంగ్ తొందర తొందరగా కొండశిఖరమెక్కి డబ్బా మూతతీసి 'కొట్టాలి' అన్నాడు. అనడమే తడవుగా అంతులేని సైన్యం డబ్బానుండి బైటబడి, శత్రు సేనను హతమార్చ సాగింది. శత్రుసైన్యం సగానికి లోపుగా మిగిలినప్పుడు చైవాంగ్ తన సైన్యాన్ని పిలిచి డబ్బా దాచిపెట్టాడు. తరువాత బుడ్డిమూత తీసి "ముంచెయ్యాలి"అన్నాడు. వెంటనే అందులోనుండి పెద్ద జలప్రవాహంవచ్చి శత్రుసేనల్ని ఒక్కసారిగా ముంచేసింది. ఆ ప్రవాహంలో సైన్యంతోపాటు కోటాధ్యక్షుడు, అతనికుమారుడూ అయిపులేకుండా కొట్టుకుపోయారు.

తరువాత చైవాంగ్ కోటలోని సుందరిని తెచ్చుకుని తన భార్యగా చేసుకున్నాడు. ఆ డబ్బా, బుడ్డీ జలరాజుకు తిరిగి ఇచ్చివేశాడు.

ఈ విధంగా సుఖసూర్యుడు ఆ పర్వతశిఖరం మీద ప్రకాశించాడు; కష్ట కల్మషం ఆ ప్రవాహంలో కొట్టుకుపోయింది.





వృద్ధుఁడు అతణ్ణి క్షమిస్తూ "నాయనా! దేవుడు అందరికీ ఒకడేనని ఇప్పుడైనా తెలుసుకున్నావా?" అన్నాడు.

# ఒక్కడే దేవుడు

నీరా సక్సేనా

ఫ్రాన్సు దేశంలో ఇబ్రహీమ్ అనే ఒక ఫాదిరీ ఉండేవాడు. అతడు మంచి ధర్మాత్ముడు, పరోపకారీని. భార్య, పిల్లలు, తాను ఒక పూరింటిలో వుండేవారు. ఆ పూరిల్లు రెండు పట్టణాలకు మధ్య ఒకరోడ్డుకు ప్రక్కగావుండేది.

అందుచేత ఆ రోడ్డున నడిచే యాత్రికులు తరచుగా ఆ ఇంటివద్ద విశ్రమిస్తుండే వారు. దీనికి, ఆ రోడ్డుమీద ఎక్కడా చెట్టూ చేమా లేకపోవడం కూడా ఒక కారణమే. పరోపకారి అవడంచేత ఆయన యాత్రికుల్ని ప్రేమతో ఆదరిస్తుండే వాడు. సమయానికి వచ్చిన యాత్రికులు కాళ్ళుచేతులు కడుగుకొని పరివారంతో పాటు భోజనం చేస్తుండేవారు. కాని భోజనానికి పూర్వం చిన్న ప్రార్థన చేయడం ఆ ఫాదిరీకి తప్పనిసరి నియమం. మొదట తాను ఈశ్వరునికి ధన్యవాదములు అర్పించుకునేవాడు. తరువాత భార్య, బిడ్డలు, అతిథులు అది వుచ్చరిస్తుండేవారు. ఇది ఆ యింటిలో నియమం.

ఇలా యాత్రికులకు సేవజేస్తూ వుండగా కొంతకాలానికి ఆ ఫాదిరీ బీదవాడైపోయాడు. ఎల్లకాలము ఒకే రీతిని వుండబోదుగదా? అయినా తాను తన పరివారము ఒక పూట భోజనం చేస్తూ రెండో పూట గ్రాసం అతిథుల కొరకు అట్టేపెడుతుండేవాడు. ఈ పరోపకార కార్యంలో అతని మనస్సుకి ఒక విధమయిన సుఖము, శాంతి కలుగుతుండేవి. క్రమంగా ఈ గుణాల వల్లనే అతనికి కాస్త "అహం" కలుగసాగింది. అతను "అందరికంటే నేనే ధర్మాత్ముడను. నా ధర్మమే సిసలయిన ధర్మము"అని అనుకోసాగాడు.

ఇలా వుండగా ఒకనాడు పగలు పన్నెండు గంటలకు సరిగ్గా ఒక వృద్ధ యాత్రికుడు ఆ యిల్లు చేరుకున్నాడు. అతని శరీరము చాలా బలహీనంగా వున్నది. వయిసు పండినవాడవడంచేత నడుము వంగిపోయినది. నడవడానికి ఓపిక లేదు. కాళ్ళు తడబడుతున్నాయి. ఆ ముసలిపండును చూడడంతోనే ఆ ఫాదిరి అతనిని యెంతో ఆదరముతో లోపలికి తీసుకువచ్చి తగిన వుపచారము చేసి కూర్చుండబెట్టాడు. కాస్త బడలిక తీరగానే ఆ వృద్ధుడు ఫాదిరీతో 'బిడ్డా! ఎంతో దూరాన్నుంచి వస్తున్నాను. నిన్న తిన్న అన్నం, ఆకలవుతున్నది. కాస్త అన్నం వుంటే పెట్టు నాయనా!" అన్నాడు దీనంగా. వృద్ధుని మాటలకు ఫాదిరికి జాలి కలిగింది. వెంటనే వంట చేయించాడు. వడ్డన కూడా అయినది. కాని తన నియమం ప్రకారం భోజనానికి పూర్వం చిన్న ప్రార్థన చేశాడు. తరువాత

భార్యా, బిడ్డలు అది వుచ్చరించారు. కాని వృద్ధుడు మాత్రం మౌనంగా కూర్చు న్నాడు. ప్రార్థన ఉచ్చరించలేదు. ఇది కనిపెట్టి ఫాదిరి- "ఏమి తాతా! మా ధర్మ మంటే నీకు నమ్మకంలేదా? ప్రార్థన ఎందుకు చేయలేదు?" అని అడిగాడు.

వృద్ధుడు- 'మేము అగ్నిని పూజిస్తాం' అన్నాడు.

ఆమాట వినేసరికి ఇబ్రహీం ఫాదిరి కళ్ళు ఎఱ్ఱబారి పోయినయి. కోపంతో- "మా ధర్మాన్ని నమ్మకపోతే, మాతో ప్రార్థన చేయకపోతే, ఇక్కడి నుంచి లేచిపో" అని ముసలిపండును అన్నం తిననివ్వకుండానే బయటకు ెంటె, దభీలున తలుపులేసుకున్నాడు. ఇంతలో ఇంటిలో ఒక విచిత్రమైన వెలుతురు గోచరించింది. ఆ వెలుతురులో ఒక దేవదూత వచ్చి "ఇబ్రహీం! నీవు చాలా పొరపాటు పనిచేశావు. అతడు శతవృద్ధుడు. పేదవాడు. ఇన్ని ఏండ్లవరకు దేవుడు అతన్ని కాపాడగా, ఒక్కపూట నీవు అతనికి అన్నం పెట్టలేకపోయావా? ఇంతకూ అతని అపరాధం? నీధర్మాన్ని నమ్మకపోవడం. అంతేగా! లోకంలో ఎన్ని ధర్మా లయినా వుండవచ్చు, కాని వాటి అన్నింటిలోనూ ఈశ్వరుడు ఒక్కడేవున్నాడు. ఆ సంగతి మీరు మరుస్తున్నారు, సుమా?" అనిచెప్పి అంతర్ధానమయిపోయింది.

ఇబ్రహీం ఫాదిరి తనతప్పు తెలుసుకున్నాడు. వెంటనే పరుగెత్తి ఆ ముసలి యాత్రికుణ్ణి క్షమాపణ వేడుకున్నాడు. ఫాదిరికి క్షమాదానంచేస్తూ ఆ వృద్ధుడు- "బిడ్డా! దేవుడు ఒక్కడేనని ఇప్పుడైనా తెలుసుకున్నావా?" అన్నాడు.

ఈ మాటకు ఇబ్రాహీం ఆశ్చర్యపడ్డాడు. ఎందువల్లనంటే అంతకుముందు ఆ దేవదూత కూడా అదేమాట చెప్పింది!



నార్వేదేశపు కథ:

# గుంటనక్క తోక తెలుపు ఎందుకయింది?

మన్మథనాథగుప్త

నార్వే దేశంలో పూర్వం ఓ ముసలమ్మవుండేది. ఆమె బాతుల్ని పెంచుకుంటూ వుండేది. ఆ ముసలమ్మకు ధనము, సంతానము, సంపాదన, అన్నీ ఆ బాతులే.

ముసలమ్మ బాతుల్ని పెంచడానికి ఒకఅమ్మాయిని జీతానికి పెట్టుకొన్నది. కాని కొంతకాలానికి ఆ పిల్ల పారిపోయింది. ఆనాటినుంచి ముసలమ్మే బాతుల్ని స్వయంగా చూచుకునేది. అది ఆమెకు ఒక పెద్ద పని అయిపోయింది.

ముసలమ్మకు ఇంటిపనులు చూచుకోవడం, ప్రతివారం బజారుకు వెళ్ళి బాతులనమ్మడం, ఆ డబ్బుతో ఇంటి ఖర్చులు, బాతులకు వారానికి సరిపడే మేత కొనుక్కురావడం, ఇన్ని పనులుండేవి. పైగా దినమంతా బాతుల్ని కనిపెట్టుకొని వుండాలి. ఇవన్నీ చూచుకోవడం ముసలమ్మకు భారంగా తోచింది. కనీసం బాతుల్ని కనిపెట్టుకు వుండేటందుకైనా ఒక పిల్ల అవసరమనిపించింది. ఒకనాడు తెల్లవారకముందే లేచి ముసలమ్మ పిల్లకోసం బయలుదేరింది.

వెళ్ళగా వెళ్ళగా దారిలో ఎలుగుబంటి ఎదురయింది. ఆ ప్రాంతంలో నివసించేదే కాబట్టి అడవి జంతువులంటే ఆ ముసలమ్మ అట్టే భయపడేది కాదు. అందులోనూ ఎలుగుబంటిని అనేక సార్లు చూచిందే గనుక చనువుగా దానితో "నమస్తేజీ!" అంది.

ఎలుగుబంటి- "నమస్తే మాతాజీ! చీకట్లో బైలుదేరావు, ఎక్కడికి వెడుతున్నావేమిటి?" అన్నది.

ముసలమ్మ- "బాతుల్ని కనిపెట్టుకుని వుండడానికి ఎవరైనా ఒక పిల్ల దొరుకుతుందేమోనని వెడుతున్నాను" అన్నది.

ఎలుగుబంటి- "ఇంతమాత్రందానికి ఇంతదూరం రావాలా? ముసలమ్మా, నీవు ఇంతశ్రమ ఎందుకు పడుతావు? ఇదీ ఒకపనేనా? ఇంటివద్ద గోళ్లు గిల్లుకుంటూ కూచుంటున్నాను. తెలిస్తే ఈపని నేను చేయగలను. ఇరుగు పొరుగు వాళ్ళం కూడాను. ఈమాత్రం సహాయం చేయలేనా?" అన్నది.

ముసలమ్మ- "అవును బిడ్డా! కాలపరిస్థితులను బట్టి బాగానే చెప్పావు. కాని అన్ని పనులూ అందరికీ సాధ్యమవడం కష్టం. నీ పిలుపుకే బాతులు హడలెత్తి పోతాయి. నేను పిలిచినట్టుగా వాటిని నీవు పిలువలేవని నా నమ్మకం" అన్నది.

ఎలుగుబంటి- "బాగాచెప్పావు, ముసలమ్మా! నా కంఠం ఎలాకావాలంటే అలా పలుకుతుంది" అని ఒకసారి 'గీ' అని "విన్నావా, నా కంఠం ఎంత మధురంగా వుందో?''

ముసలమ్మ చెవుల్లో వేలు పెట్టుకుని- "చాలు, చాలు బిడ్డా! నీ మధుర స్వరం దున్నపోతుల్ని కూడా హడల గొడుతుంది. ఇక నా బాతుల సంగతి చెప్పాలా?''

ఇలా అని ముసలమ్మ కొంతముందుకు వెళ్ళేసరికి తోడేలు ఎదురయింది. ముసలమ్మ తోడేలుతో 'నమస్తే' అన్నది.

తోడేలు- "నమస్తే, నమస్తే మాతాజీ! ఇంత పొద్దున్నే ఎక్కడికేమిటి?"

ముసలమ్మ- "బాతుల్ని కాచే పిల్లకోసం వెదుకుతున్నాను."

తోడేలుకు ప్రాణం లేచివచ్చినట్లయింది. నోరూరించుకుంటూ ఇలా అన్నది- ''ఇంత శ్రమ ఎందుకు ముసలమ్మా! ఈపని నేను చక్కగా చేయగలనే! ఒకసారి ఆ పని నాకు అప్పగించి చూడు. నీకే తెలుస్తుంది.''

ముసలమ్మ- "ఆ! నీవు లేడిలా పరుగెత్తగలవని నేనెరుగుదును. నీముందు బాతులు పరుగెత్తి తప్పించుకుంటాయన్నమాట వట్టిదిలే! కాని, నేను వాటిని పిలిచినట్టుగా నీవు పిలువలేవని నా నమ్మకం.''

తోడేలు ఒకసారి గట్టిగా అరిచి-“విన్నావా నేనెంత శ్రావ్యంగా పిలుస్తానో?”



“ఈ విధంగానే పిలిచావంటే ఆ బాతులన్నీ కాలికి బుద్ధి చెప్పుతాయి. ఈ పని నీవల్ల కాదు” అన్నది ముసల్ది.

తోడేలు కేక వినేసరికి ముసలమ్మకే వళ్ళు జలదరించి అన్నది- "ఆ! ఈవిధంగానే బాతుల్ని పిలిచావంటే, అవి కాళ్ళకు బుద్ధిచెప్పుతాయన్నమాటే. ఆపని నీవల్ల కాదు."

ముసలమ్మ మరికొంతముందుకు పోయింది. అక్కడ ఒక గుంటనక్క ఎదురయింది. "నమస్తే మాతాజీ! ప్రొద్దున్నే బయలుదేరావు, యెక్కడికేమిటి? "ఏమిసేవ చేయమంటారో చెప్పండి?" అన్నది.

ముసలమ్మ- "ఆ! పనిబడింది. ప్రొద్దున్నే బయలుదేరాను. ఇంటివద్ద కూచోవడం బరువా? ఎంతసేపైనా కూచోవచ్చు. బాతుల చింత కూచోనిస్తేగా? ఇందుకే బయలుదేరాను, ఎక్కడైనా కాపలాపిల్ల దొరుకుతుందేమోనని. చాలా అవసరం."

గుంటనక్క- "చాలు, చాలు ముసలమ్మా! ఈ మాత్రం భాగ్యానికేనా; కాళ్ళీడ్చుకుంటూ పోతున్నది? బహుశా మీరెరుగరు, పనిలో నాకున్న అనుభవం. తెలవిస్తే ఆపనిని నేను చక్కబెట్టగలను. మీరు నిశ్చింతగా వుండవచ్చు."

పాపం ముసలమ్మ అప్పటికే తిరిగి తిరిగి వేసారింది. ఇక తిరగడానికి వోపిక లేదు. అందువల్ల ముందు వెనకలు ఆలోచించకుండా నక్కమాటలు నమ్మి, దాన్నే కాపలా పెట్టడానికి అంగీకరించింది. బాతుల్ని కాపాడేటంత యుక్తి, వివేకాలు నక్కలో యెంతవరకున్నాయని కూడా ఆలోచించలేదు. మారు మాటాడకుండా నక్కను వెంటబెట్టుకు వెళ్ళింది. ఇంటివద్ద బాతుల్ని చూపించి- "ఇవిగో వీటిని నీకు అప్పగిస్తున్నాను. ఈ పనిలో ఏమాత్రం అజాగ్రత్త జరిగినా నిన్ను తీసివేస్తాను సుమా?" అని హెచ్చరించింది

గుంటనక్క అన్ని షరతులకు ఒప్పుకున్నది. ఇటు ముసలమ్మ చింత తీరి పోయింది. అటు నక్క అదృష్టం పండింది. నక్క కాపలాకి వెళ్ళిన మొదటిదినమే అరడజను బాతుల్ని తినివేసింది. మరుసటిరోజున మరో అరడజను, మూడోదినం అదేప్రకారం తినడం సాగించింది.



ఆమె తిరిగి వచ్చేసరికి నక్క వెన్నకూడా కాజేస్తున్నది. 'అమ్మ నీ తస్సాదియ్యా!' అని ఆ వెన్నపిడత 'నక్కమీదేసి కొట్టింది. నక్క పరుగెత్తసాగింది. వెన్న దాని తోకమీదపడింది.

పాపం ముసలమ్మకీసంగతేమీ తెలియదు. కారణం ఒకటి, ముసలమ్మకు చూపు మాంద్యం; రెండు, లెఖ్క రాదు. ఇందువల్ల నక్క పని చక్కగా జరిగి పోతున్నది. రోజూ బాతులను ఫలహారం చేయసాగింది. క్రమక్రమంగా బాతులన్ని టిన్నీ నామరూపాలు లేకుండా తినివేసింది.

జిత్తులమారి నక్క బాతులన్నిటినీ కాజేసి ముసలమ్మవద్దకు వచ్చి చెప్పింది. అంతవరకు ముసలమ్మకు బాతులసంగతి తెలియనే తెలియదు. ఆతురతతో "బాతుల్ని ఏమిచేశావు?" అని అడిగింది.

అడిగిందే తడవుగా నక్క- "బాతులన్నీ చెరువులో వున్నాయి. నా పిలుపు లకు రావడంలేదు" అని జవాబిచ్చింది.

ముసలమ్మ రుసరుసలాడుతూ "అనుకున్నంత పనీ అయింది, ఈపని నీవల్ల కాదని అనుకుంటూనే వున్నాను. ఇక నేనే వెడతానులే!" అని చేతిలోని వెన్న పిడత కిందపెట్టి, ముసలమ్మ కంగారుగా చెరువుగట్టుకు పరుగెత్తింది.

నక్క పారిపోవడానికి ఇదే సమయం అనుకున్నది. కాని ఎదురుగా వున్న వెన్న పిడతను వదలడానికి మనసొప్పలేదు. 'ముసలమ్మకు బాతులు దొరకనిమాట నిజం. ఆమె తిరిగి తిరిగి వచ్చేసరికి వెన్న కూడా కాజేయవచ్చనుకుని' నక్క ఆ వెన్ననుకూడా తినసాగింది. అక్కడ చెరువుగట్టుమీద ముసలమ్మకు బాతులు దొరకలేదు సరిగదా వాటి యెముకలుమాత్రం గుట్టలు గుట్టలుగా కనుపించాయి. బాతులనన్నిటినీ ఆ మాయలమారి నక్కే తనపొట్టన బెట్టుకున్నదని ముసలమ్మకు అప్పుడు తెలిసింది. లబో దిబో మంటూ తిరిగివచ్చింద. ఇంటికి వచ్చేసరికి నక్క వెన్న సగం తినేసింది. "అమ్మ దీని తస్సదియ్యా! బాతుల్ని తినడమేకాకుండా వెన్నకూడా తినేస్తున్న" దని ఆ వెన్నపిడత నక్కమీద విసిరికొట్టింది. కాలికొద్దీ పరుగెత్తే గుంటనక్క తోకమీద ఆ తెల్లని వెన్న పడింది.

అప్పటికీ ఇప్పటికీ గుంటనక్కతోకమీద తెల్లనిమచ్చ అల్లానే వుండిపోయింది. గుంటనక్కల తోకలు తెల్లగావుండడానికి అదేకారణం. తెల్లతోకల నక్కలను చూచినప్పుడల్లా, నక్కలు నాడు ముసలమ్మ బాతుల్ని, వెన్నను తిన్న గుంటనక్క సంతానమేనని నార్వేదేశపు బాలురు అనుకుంటూ వుంటారు.



గ్రీసుదేశపు కథ:

# పన్నెండుగురు సోదరులు

సూర్యభాను 'కపిల'

అనగా అనగా ఒకరాజు వుండేవాడు. అతనికి అందమైన ఒకరాణి వుండేది. వారు ఆనందంగా కాలంగడుపుతూ వుండగా కొంతకాలానికి పన్నెండుగురు కొడుకులు పుట్టారు. స్త్రీ సంతానం బొత్తిగాలేదు. దేవుని దయవల్ల పదమూడవ సంతానం కలగబోతుందనగా క్రొద్దిదినాలకు ముందు రాజు రాణితో "ఈసారి మనకు పుత్రిక పుట్టిందా పన్నెండుగురు కొడుకుల్ని చంపేస్తాను. లేకపోతే కూతురు నారాజ్యానికి ఉత్తరాధికారి కాలేదు" అన్నాడు. ఆ మాటలు వినగానే రాణికి ఎక్కడలేని దుఃఖం కలిగింది. ఎప్పుడు చూచినా కంట తడిబెట్టుకునే వుండేది.

కడసారి కొడుకు చిన్నవాడవడంచేత ఎప్పుడూ తల్లి దగ్గరే వుండేవాడు. చిన్నవాడి పేరు బెంజామిను. తల్లి విచారముగా వుండటం చూచి 'అమ్మా! నీవు ఎప్పుడూ దుఃఖిస్తూవుంటావు, ఎందుకు?' అని అడిగాడు.

"నాయనా", తల్లి కండ్లనీరు తుడుచుకుంటూ "అది నీకు చెప్పదగినది కాదు" అన్నది.

బెంజామిను చెప్పమని మొండిపట్టు పట్టేసరికి, తల్లి చెప్పక తప్పిందికాదు.

తల్లిద్వారా సంగతి తెలుసుకుని బెంజామిను ఇల్లా అన్నాడు- "అమ్మా! నీవు చింత పడవద్దు. మమ్ము మేము కాపాడుకోగలము. ఎక్కడికైనా దూర దేశం పారిపోతాం."

"అవును" తల్లి అన్నది. "మీరు పన్నెండుగురూ అడవిలోకి వెళ్ళిపొండి. అక్కడ ఒక ఎత్తైన వృక్షమెక్కి రోజూ రాజభవనంవైపు చూస్తూవుండండి. మీకు తమ్ముడు కలిగితే భవనంమీద తెల్లజెండా యెత్తిస్తాను. అదిచూచి మీరు

ఇంటికి తిరిగి రావచ్చు. ఒక వేళ చెల్లెలు పుట్టితే ఎఱ్ఱఝుండా యెత్తిస్తాను. అది చూచి మీరు మరీ దూరంగా వెళ్ళిపోవచ్చును.''

తరువాత తల్లి ఆశీర్వాదం పొంది పన్నెండుమంది సోదర్లూ అడవికి వెళ్ళిపోయారు. అక్కడ ఒకరి తరువాత ఒకరు చెట్టు ఎక్కి చూడవలెనని వంతులు వేసుకున్నారు. రోజుకొకరు చొప్పున ఒక చెట్టు ఎక్కి రాజభవనం వైపు చూడ సాగారు. దాని ప్రకారంగా పదకొండుదినాల పిమ్మట కడసారివాడు బెంజామిను వంతు వచ్చింది. అతడు ఆ దినం ఒక వృక్షమెక్కి రాజభవనం వేపు చూడ సాగాడు. కొంతసేపు బాగా తేరపారచూడగా అతనికి ఎఱ్ఱఝుండా కనుపించింది.



అతడు ఒక వృక్షమెక్కి రాజభవనం వేపు చూస్తున్నాడు.
కొంతసేపటికి రాజభవనం మీద ఎఱ్ఱఝుండా ఎత్తుతున్నట్టుగా కనిపించింది.

తమకు అరిష్టమైన ఈ కబురును బెంజామినుద్వారా వినగానే మిగతా అన్నలకు విపరీతంగా కోపం కలిగింది. 'ఒక్క కూతుర్నుగురించి ఇంతమంది ప్రాణాలు తీయడమా? దీనికిబదులుగా మనకు కనుపించిన ఆడపిల్లలనెల్లా నరికివేస్తాం' అని శపథం చేశారు వారు.

పిమ్మట ఆ సోదరులు అడవిలో, బాగా లోపలికి చొచ్చుకుపోయారు. వెళ్ళగా వెళ్ళగా ఒకచోట వారికి ఒక కుటీరం కనుపించింది. అది ఖాళీగా వుండటంచూచి అందులోనే వుండసాగారు. తమ్ముడు బెంజామిను కుటీరానికి కాపలా వున్నాడు. మిగతా అన్నలు ఆహారం సేకరించడానికి వెళ్ళారు.

కాలచక్రపుగతి అతి వేగమయినది. పన్నెండుమంది సోదరులకు ఆ కుటీరములో పదేండ్లు గడిచిపోయాయి. అక్కడ రాజభవనంలో చెల్లెలు పుట్టి పెరుగుతున్నది. ఆమె సుగుణాల కుప్ప, సౌందర్యరాశి, నొసట నక్షత్రంతో చూడ చక్కని బొమ్మలా వున్నది. ఒకనాడు ఏదో ఉత్సవం నిమిత్తం రాజభవనం శుభ్రపరుస్తుండగా చిన్నవి పన్నెండు చొక్కాలు దండెం మీద ఆ అమ్మాయికి కనుపించాయి. వెంటనే తనకు కలిగిన సందేహం తల్లిదగ్గర ఈలా ప్రకటించింది- "అమ్మా! అమ్మా!! ఇంత చిన్న చొక్కాలు ఎవరివే? నాన్నగారివైతే కాదు; నాన్నకవి సరిపోవు. మరి ఎవరివై వుంటాయి?"

తల్లి పెద్ద నిట్టూర్పు విడిచి "నాచిట్టీ! ఇవి నీ పన్నెండుమంది అన్నలవి" అన్నది.

"ఆ! పన్నెండుమంది అన్నలా?" కూతురు ఆశ్చర్యచకితురాలయి అడిగింది. "నిజమేనా? నేనింతవరకూ చూడలేదే? ఎక్కడ వున్నారు?"

"దేవుడికెరుక," తల్లి గద్గదకంఠంతో చెప్పింది- "బిడ్డలెక్కడవున్నారో?" తరువాత జరిగిన కథ అంతా కూతురికి వివరంగా చెప్పింది తల్లి.

"అయితే అమ్మా! నీవు ఏడవకు" సంగతి విని కూతురన్నది "నేను నా పన్నెండుమంది అన్నలను వెదకి తెస్తాను చూడు."

మరునాడు పన్నెండు చొక్కాలూ పట్టుకుని రాజకుమారి అడవికి వెళ్లింది. దినమంతా తిరిగి తిరిగి కడకు సాయంత్రం అన్నలున్న కుటీరం చూడగలిగింది.

కుటీరంలోకి ప్రవేశించబోతుండగా బెంజామిను అడ్డుపడి "ఎవరు నీవు? ఎక్కడి నుండి వచ్చావు?" అని ప్రశ్నించాడు.

"నేనొక రాజపుత్రికను" అని రాజకుమారి చెప్పింది. "నా పన్నెండుమంది అన్నల్ని వెదుకుతున్నాను" అని బెంజామినుకి ఆ పన్నెండు చొక్కాలూ చూపించింది.

ఆమె తన చెల్లెలని తెలుసుకుని అపరిమిత ఆనందంతో "నేను నీ చిన్న అన్నను. బెంజామిను నా పేరు" అన్నాడు.

అన్నా, చెల్లెలు ఒకరినొకరు కౌగలించుకున్నారు. సంతోషంతో వారి కళ్లు చెమ్మగిల్లినాయి.

"చెల్లీ!" సంతోషం కాస్త శాంతించిన తరువాత బెంజామిను అన్నాడు- "ఒక్క సంగతి విను. ఒక్క ఆడపిల్లను గురించి మేము పన్నెండుగురం రాజభవనం విడువవలసి వచ్చింది. అందుచేత కనుపించిన ఆడపిల్లలనెల్లా నరికివేయాలని శపథం చేసుకున్నాం."

రాజకుమారి అన్నకు ఇలా జవాబిచ్చింది- "అయితే మృత్యువును సంతోషంగా స్వీకరిస్తాను. నా ఒక్క మృత్యువువల్ల పన్నెండుమంది ప్రాణాలు నిలుస్తాయి."

"కాదు" బెంజామిను అన్నాడు. "అది యెన్నటికీ కాదు. నీవు ఈ పెట్టెలో దాక్కో. అన్నలు వచ్చిన తరువాత వారితో నేను మాట్లాడుతాను."

రాజకుమారి బెంజామిను చెప్పిన ప్రకారంగానే దాక్కున్నది. చీకటి పడగానే అన్నలు వేటనుండి వచ్చారు. అంతా అన్నం తింటున్నారు. అప్పుడు "ఈవేళ క్రొత్తసంగతులు ఏమిటి?" అందులో ఒక అన్నగారు అడిగాడు.

"ఆ!" బెంజామిను జవాబిచ్చాడు. "కాని మొదట కనుపించిన అమ్మాయిని రక్షిస్తామని శపథం చేస్తేనే చెప్పుతాను."

"సరే రక్షించడమేమిటి? ఆమె వంటిమీద ఈగనైనా వాలనివ్వం, త్వరగా చెప్పు" అన్నారు, అన్నలు అందరూను.

"మనచెల్లెలు యిక్కడే వున్నది" అంటూ బెంజామిను పెట్టె మూత తెరిచాడు. చూడముచ్చటగా కలకలలాడుతూ రాజకుమారి పైటకువచ్చింది. ఆమె రాజదుస్తులు ధరించింది. నొసట నక్షత్రం తళతళలాడుతున్నది. ముద్దులొలికించే ఆ ముఖం ఎంతో సుందరంగా వున్నది. చెల్లెల్ని చూడగానే అన్నలు ఆనంద సాగరంలో తేలిపోయారు. కౌగలించుకొని ఎంతో గారాబంగా ముద్దులు పెట్టుకున్నారు.

రాజకుమారి అన్నలదగ్గర వుంటూ, వారికి ఇంటిపనుల్లో సహాయపడ సాగింది.

ఆ కుటీరము ప్రక్కనే ఒక చిన్న పూలతోట వున్నది. అందులో పన్నెండు 'లిల్లీ' పూవులు చక్కగా వికసించివున్నాయి. రాజకుమారి ఆ పూవులుకోసి అన్నల చొక్కాలలో పెట్టిన బాగుండునని తలచి పూలను తుంచినది. తుంచీ తుంచడముతోనే తన పన్నెండు మంది అన్నలు పన్నెండు రాజహంసలుగా మారి ఆకాశానికి ఎగిరి పోయారు పూలతోట మాయమైపోయింది. అడవిలో రాజకుమారి వంటరిది అయిపోయింది. ఎటు చూచినా ఎవరూ తోడులేరు. వంటరిగా దుఃఖిస్తూవున్న ఆ అమ్మాయికి ఒక ముసలమ్మ కనుపించింది.

"నా చిట్టీ!" ముసలమ్మ అన్నది- "నిన్ను ఆపూవులెవరు కోయమన్నారమ్మా? నీకు తెలియదు గాని ఆ పూవులే నీ పన్నెండుగురు అన్నలు. ఇక నీ అన్నలు నీకు దక్కరు."

"ఆ!" రాజకుమారికి ఆశ్చర్యం కలిగింది. తన తెలివితక్కువకు ఏడ్వడం మొదలుపెట్టింది. ఏడుస్తూనే- "ముసలమ్మా! మా అన్నలు మరల దక్కేవుపాయం లేదా?" అని అడిగినది దీనంగా.

"చాలాకష్టం" ముసలమ్మ జవాబిచ్చినది-"వారి అసలు రూపాలు దొరకడం కష్టమే. కాని ఒకే ఒక ఉపాయము వున్నది. ఏడు ఏళ్లపాటు మౌనవ్రతం పట్టాలి. పన్నెత్తి పలకరాదు, నోరు విప్పి నవ్వరాదు. అంతపట్టుదలగా చేయాలి. ఇందులో యేమాత్రం పొరబాటు జరిగినా నీ అన్నల ప్రాణాలు పోయినవన్నమాటే. జాగ్రత్త."



ఆమె పువ్వులు కోసీ కోయడంతోనే తన పన్నెండుగురు అన్నలు పన్నెండు రాజహంసలయి, ఆకాశ మండలానికి ఎగిరి పోయారు

రాజకుమారి అన్నలను మరల బ్రతికించుకోవాలనే కోరికలో ఆ కఠిన వ్రతం చేయ సంకల్పించుకున్నది. దగ్గరవున్న ఓక్ వృక్షం ఎక్కి అక్కడ దినమంతా నూలువడుకుతూ కాలక్షేపం చేయసాగింది.

ఈ విధంగా రోజులు గడిచిపోతున్నాయి ఒకనాడు ఒక రాజకుమారుడు వేటకోసం వచ్చి, తిరిగి తిరిగి అలసిపోయి సేద తీర్చుకొనుటకుగాను ఆ వృక్షం క్రింద విశ్రమించసాగాడు. కొంతసేపటికి రాజకుమారుడు వృక్షంపై నూలు

వడుకుతున్న రాజకుమార్తెను చూచి, ఆమె చక్కదనానికి మోహితుడయి, వృక్షమెక్కి ఆమెతో వివాహ ప్రస్తావన చేశాడు. రాజకుమారి అంగీకార సూచకంగా తలవూపింది.

తరువాత రాజకుమార్తెను చెట్టు దింపి, తన గుఱ్ఱంమీద రాజకుమారుడు ఇంటికి తీసుకువచ్చాడు. ఇంటివద్ద పెద్ద ఉత్సవాలతో, ఊరేగింపులతో వారి వివాహం జరిగింది. ఆ దంపతుల రోజులు హాయిగా గడిచిపోతున్నాయి. కాని రాజకుమారి మాత్రం పలకదు, నోరు విప్పి నవ్వదు.

ఇలా వుండగా కొంతకాలానికి రాజమాతకు తన కోడలి మూగనోము యెంతమాత్రమూ నచ్చలేదు. ఆమె చాలా దుర్మార్గురాలు. ఒకసారి కొడుకుతో "ఏమిరా నాయనా! వుండి వుండి ఈలాటి పిల్లను తెచ్చావు? పోనీ మాటలకు మూగదనుకుంటే కాస్త నవ్వనన్నా నవ్వదట్రా ఖర్మా? ఈలాటి నంగనాచివాళ్లను ఎంతమాత్రమూ నమ్మకూడదు. నామాట విను నాయనా?'' అన్నది.

కొడుకు తల్లి కపట పన్నాగాలను ఆరంభంలో నమ్మలేదు. కాని కొంత కాలానికి నిజమే కాబోలు ననుకొని భ్రమపడ్డాడు. వెంటనే రాజకుమారికి మరణదండన విధించబడింది.

రాజభవనం ఆవరణలోనే ఒక చితి పేర్చబడింది. దానిమీద రాజకుమార్తెను పడుకోబెట్టి తాళ్ళతో బంధించి వేశారు. దానికి నిప్పు అంటించారు కూడా. అప్పుడే ఆ అమ్మాయి ఏడేళ్ల మౌనవ్రతపు గడువు సమాప్తికి వచ్చింది. అది అంతిమఘడియ. అందుచేత ఆ రాజభవనపు వాకిట్లో పన్నెండు రాజహంసలువచ్చి వాలినాయి. భూమిమీద పాదములు మోపగానే రాజహంసలు యథా ప్రకారంగా రాజకుమారులుగా మారిపోయినాయి. ఆ పన్నెండుగురు రాజకుమారులు ఆ రాజకుమారి అన్నలే కాబట్టి వెంటనే చితిలోని కట్టెలు ఇటు నటు లాగివేసి నిప్పు లార్పివేసి చెల్లెల్ని రక్షించారు. గారాబంతో ముద్దులిడుకున్నారు. ఆ దినం రాజకొమార్తె పన్నెత్తి పలికింది; నోరువిప్పి నవ్వింది. తనభర్తకు తన మౌనవ్రతాన్ని గురించి చక్కగా తెలియపరచింది. రాజకుమారుడు తన తెలివితక్కువతనానికి చింతించాడు.

అప్పుడు మరల రాజకుమార్తెకు, రాజకుమారునికి పన్నెండుగురు అన్నల సమక్షంలో వైభవముగా పెండ్లి జరిగినది. వారి రోజులు మూడు పూవులు ఆరు కాయలుగా గడిచి పోతున్నాయి.

❘❘❘

ఇటలీ దేశపు కథ:

# యుక్తిగల రైతు

గీండారామ్ సుగంధ్

ఒక దినం ఒక రైతు తన పొలమును గున్నుకుంటున్నాడు. ఆ దేశపు రాజు గుఱ్ఱంమీద ఆదారినపోతూ ఆ రైతును చూచి దగ్గరకు పిలిచి, "దినానికి ఏమాత్రం సంపాదిస్తావోయ్?" అని ప్రశ్నించాడు.



"ఒకటి నేనుతింటాను, రెండవది అప్పిస్తాను, మూడవది అప్పుతీరుస్తాను, నాలుగోది నూతిలో పడేస్తాను" అని రైతు జవాబిచ్చాడు.

రైతు- "నాలుగు అణాలు మాత్రం సంపాదించుకుంటానండి" అని జవాబిచ్చాడు.

రాజు- "వాటిని ఏమిచేస్తావు?" అన్నాడు.

రైతు ఈ విధముగా జవాబు చెప్పాడు- "ఒక దానితో అన్నం తింటాను. రెండవది అప్పు ఇస్తాను, మూడవదానితో అప్పు తీరుస్తాను, నాలుగోది నూతిలో వేస్తాను."

రాజు ఆ మాటలకు అర్థం తెలుసుకోలేకపోయాడు. వాటికర్థము చెప్పుమని రైతును అడిగాడు. రైతు ఈ విధంగా స్పష్టపరిచాడు- "మహారాజా! మొదటి దానితో నాభార్యా, నేను పొట్ట పోసుకుంటాము. రెండవ దానితో బిడ్డలకు అన్నంపెట్టి వారి ఆకలి తీరుస్తాం. తరువాత వార్ధక్యం వచ్చి, పనిచేయలేనప్పుడు బిడ్డలు నాకు తిండిపెట్టి పోషిస్తారు. ఈ విధంగా నాబాకీ నాకు తీరిపోతుంది. మూడవది, నాతండ్రిని గురించి ఖర్చుపెడతాను. ఇదివరకు అతను నన్ను పెంచి పెద్దను చేశాడు. ఈ విధంగా ఇప్పుడు ఆ రుణం తీరిపోతున్నది. ఇక నాలుగోది దానధర్మాల క్రింద ఖర్చు చేస్తాను. దీనికి ఏవిధమయిన ఫలితంగాని, లాభంగాని ఈ లోకంలో కోరను. మహానుభావా! ఇది నామాటల తాత్పర్యం."

రైతు మాటలకు రాజు అపరిమితమైన ఆనందం పొంది- ''ఇదిగో నేటి తర్వాత నూరు పర్యాయములు నాముఖం చూడకుండా ఈ రహస్యము యితరులకు ఎవరికీ, చెప్పనని ఒట్టుపెట్టుకో" అన్నాడు. రైతు ఒప్పుకుని ఒట్టు పెట్టుకున్నాడు..

రెండవ దినం రాజు మంత్రులతో కొలువు దీర్చి కూర్చున్నాడు. అప్పుడు మంత్రులను సంబోధించి "ఓ సచివులారా! మన రాజ్యంలో ఒక రైతు ఉన్నాడు. అతను రోజంతా కష్టపడి నాలుగు అణాలు సంపాదించుతాడు. అందు మొదటి దానితో తాను తింటాడు. రెండవది బదులు యిస్తాడు. మూడవ దానితో అప్పు తీరుస్తాడు. నాలుగోది నూతిలో పడేస్తాడు. దీని అంతరార్థం ఎరిగినవారు ఎవరయినా వుంటే చెప్పండి?" అని ప్రశ్నించాడు. మంత్రులు ఎంత ఆలోచించినా

ఆ మాటల రహస్యం తెలుసుకోలేకపోయారు. రాజుగారికి జవాబు ఇవ్వజాలక ఒకరి ముఖము ఒకరు చూచుకొని పూరకున్నారు.

రాజుగారు క్రిందటిరోజు ఒక రైతుతో ఏమేమో మాట్లాడినట్టు ఒక మంత్రి ఏవిధంగానో పసికట్టాడు. ఆ మంత్రి వెంటనే రైతువద్దకు పరుగెత్తి "నిన్న రాజుగారికీ నీకూ జరిగిన మాటల రహస్యం చెప్పు"మని ప్రార్థించాడు.

రైతు ఈవిధంగా జవాబిచ్చాడు- "నూరుసార్లు నేను రాజుగారి ముఖదర్శనం చేసుకోనిదే, ఈ రహస్యం తమకు చెప్పలేకున్నందుకు చింతిస్తున్నాను. క్షమించండి." మంత్రి ఆమాటల మర్మం వెంటనే గ్రహించాడు. తాను మంత్రి అయినప్పుడు తనకు ఏమికొరవ? వెంటనే రాజుగారి బొమ్మతో నూరు బంగారు ముద్రలు చేయించి, రైతుకు ఇచ్చాడు. ఇంకేముంది? కొండమీది కోతి దిగి వచ్చింది. రైతు రహస్యం చెప్పేశాడు.

మంత్రి సంతోషంతో పరుగుపరుగున వచ్చి రాజు ప్రశ్నకు జవాబిచ్చాడు. రాజు "నీవు ఆ రైతునడిగి తెలుసుకున్నావు కదూ?" అన్నాడు. మంత్రి "లేదు మహారాజా!" అన్నాడు.

రాజుగారు వెంటనే ఆ రైతును పిలిపించి "నీవు నీ ప్రతిజ్ఞను ఎందుకు పాలించలేదు?" అని అడిగాడు.

రైతు నిర్భయంగా "అయ్యా! ఆ రహస్యం చెప్పేముందు నూరుసార్లు ఏలినవారి ముఖం దర్శించ గలిగానండి"అని తన సంచి విప్పి నూరు రాజముద్రలు చూపించాడు.

రాజు రైతు యుక్తికి మెచ్చుకుని, ఇంకొక నూరు ముద్రలు అదనంగా ఇచ్చి "ఇది నీ యుక్తికి బహుమతి" అని వెళ్లమన్నాడు.



రెడ్ ఇండియన్ల కథ:

# సూర్యుణ్ణి వెదకడం

మోహన్‌సింగ్ సామంత్

చాలా పూర్వంనాటి సంగతి. ఆ రోజుల్లో యుద్ధాలుండేవిగావు. ఆ పేరు కూడా ఎవరూ వినియుండలేదు. మానవులందరూ అన్నదమ్ములవలె కలసి మెలసి సంతోషంతో, శాంతంగా వుండేవారు. ఆ రోజుల్లో ఒక గ్రామంలో సాటిలేని సౌందర్యవతియైన అమ్మాయి ఒకతె వుండేది. ఆమెను పెళ్ళాడడానికి అనేకులు యువకులు, రాజకుమార్లు, అధికారి కొడుకులు వస్తుండేవారు.



యువకుడు తన తలపాగా నుంచి ఆ రెండు ఈకలూ తీసి యువతికిచ్చి "సూర్యభగవానుడు నిన్ను మెచ్చుకుని, ఇవి పంపినాడు" అని చెప్పాడు.

కాని ఆ సుందరి అందరినీ ససేమిరా అనేది. పెళ్ళిమాట తలపెట్టినప్పుడల్లా ఆ అమ్మాయి "నేను పెళ్ళిచేసుకోన"ని జవాబు చెబుతుండేది.

ఆ వూరిలోనే నది వొడ్డున ఒక యువకుడు ఉండేవాడు. అతడు ఎంతో అందగాడు, దృఢకాయుడు. కాని పాపం, అతి పేదవాడు. బుగ్గమీద ఒక గాయపు మచ్చకూడా వున్నది. ఆ వూరివారందరూ ఆ నదికే నీళ్లకొరకు వస్తుండే వారు. ఆ యువకుడు రోజూ ఆ నీలాటిరేవు వద్దే పొంచివుండి, ఆ సుందరికోసం చూస్తుండేవాడు.

ఇలా వుండగా ఒకనాడు ఆ అమ్మాయి వంటరిగా రావడం చూచి ఆమెతో ఇట్లా అన్నాడు- "ఓ సుందరీ! నీవు పెద్దపెద్ద కొమ్ములు తిరిగిన రాజకుమారులను, లక్ష్మీపుత్రులనూ నిరాకరించావు. నేను పేదవాడిని, అతి పేదవాడిని. ఇల్లు వాకిలీ లేవు; అన్నవస్త్రాలు లేవు; బంధు మిత్రులు అసలే పూజ్యం. ఏనాడో వారందరూ నన్ను విడిచి గతించిపోయారు. ఇక "నా" అనే వారు లేరు. దిక్కులేని ఏకాకిని; అయినా నీవద్దకు భిక్షానికి వచ్చాను. దయచేసి నన్ను పెళ్ళి చేసుకో. ఇదే నా ప్రార్థన."

జాలి గొలిపే ఆ యువకుని మాటలకు ఆ అమ్మాయి మనసు కరిగింది. కొంతసేపు ఆగి ఇలా అన్నది- "ఓ యువకుడా! నేను అనేకమంది శ్రీమంతుల్ని రాజకుమారుల్ని కాదన్నాను, నిజమే. కాని ఒక పేదవాడు నన్ను పెళ్ళిచేసుకో గోరుతున్నాడు. అందుకు నాకు సంతోషం. నేను నీకు భార్యనవుతాను. నాతండ్రి నిన్ను కుబేరుని చేస్తాడు."

యువకుని శరీరం పులకరించింది. మరల ఆ అమ్మాయి ఇలా అన్నది- "కాని సూర్యభగవానుని సెలవు లేనిదే నేను పెళ్ళి చేసుకోకూడదు. కాబట్టి నీవు అతని వద్దకు వెళ్ళి 'ఓ దినకరుడా! అమ్మాయి ఇంకా నీమాటమీదే వున్నది. ఏవిధమైన అధర్మమూ చేయలేదు. ఇప్పుడు పెళ్ళి చేసుకోదలచుకున్నది. నేను ఆమెను భార్యగా చేసుకోదలచుకన్నాను' అని చెప్పి, నీ బుగ్గమీదవున్న మచ్చకూడా మాన్పమని ప్రార్థించు. నీవు తిరిగివచ్చేసరికి బుగ్గమీది మచ్చమానిందా, ఆ భగవా

నుడు నీమీద ప్రసన్నుడయినాడనీ; లేక నీవు ఆ సూర్యదేవుని కనుక్కోలేక పోతివా, అది పెద్ద అపశకునమనీ తలుస్తాను. అప్పుడు నీవు నావద్దకు రావలసిన పనిలేదు."

యువకుడు ఒక్కసారి నిరుత్సాహంతో క్రుంగిపోయాడు- "ఓ! అవి ఎంత తియ్యని మాటలు. ఇవి ఎంతటి చేదుమాటలు! ఏమో! ఆసూర్యదేవుని ఆశ్రమము ఎక్కడ వున్నదో? ఎంత దూరమున్నదో!! ఆయన వద్దకు ఇంతవరకు ఎవరయినా వెళ్ళి వచ్చిన వారు ఉన్నారో, లేరో! ఎవరెరుగుదురూ?" అని తలపోయసాగాడు.

దీనికి జవాబుగా "సాహసించాలి" అనిచెప్పి, ఆ అమ్మాయి వెళ్ళిపోయింది.

యువకుడు మనసులో ఒకసారి "ఓ జగద్బాంధవా! నన్ను రక్షించు" అని ప్రార్థించుకుని ఖిన్నమైన మనస్సుతో వంటరిగా పయనమయినాడు. పోతూ పోతూ తిరిగిరాలేనేమోనని, తన ప్రియమైన గుడిసెవైపు తిరిగి తిరిగి చూస్తూ వెళ్లాడు.

యువకుడు పచ్చిక మైదానాలు, నదులు, అడవులు, కొండలు దాటుతూ పోతున్నాడు. క్రమక్రమంగా తెచ్చుకున్న ఆహార పదార్థాలు కూడా తరిగిపోతు న్నాయి. ఇలా వెళ్ళగా వెళ్ళగా దారిలో గుంటనక్క, ఎలుగుబంటి, బైజర్ (ఎలుగుబంటి లాంటి ఒక జంతువు)లు కనిపించాయి. వాటిని సూర్యదేవుని ఆశ్రమానికి దారి అడిగాడు. ప్రయోజనము లేకపోయింది. తరువాత తోడేలు ఎదురయింది. అది ఫలాని సముద్రందాటి వెళ్ళమని, దాని అవతలనే సూర్యదేవుని ఆశ్రమమున్నదని చెప్పింది.

యువకుడు నడచి నడచి కొన్ని దినాలకు సముద్రతీరం చేరుకున్నాడు. అక్కడ అంతులేని జలరాశిని చూచేసరికి అతని వళ్ళు జలదరించింది. ఆవలివొడ్డు కనుపించడం లేదు. యువకుడు భయకంపితుడయి, ధైర్యం కోలుపోయాడు. అంతులేని ఆ సముద్రం వేపు అసహాయుడై చూస్తూ నిలబడిపోయాడు. ఇంతలో రెండు హంసలు అక్కడకువచ్చి "నీవు ఎవరవు? ఎందుకు వచ్చావు?" అని ప్రశ్నించాయి.

యువకుడు అధైర్యంతో "మృత్యువు నన్ను లాక్కొచ్చింది. మా దేశం ఇక్కడికి ఎంతో దూరం. అక్కడ ఒక సాటిలేని సుందరి వున్నది. ఆమెను నేను పెళ్ళాడదలచుకున్నాను. ఆసుందరి సూర్యభగవానుని ఆజ్ఞలో వున్నదట. అందు చేత ఆ యనదర్శనం కొరకు వెడుతున్నాను. ఆయన ఆశ్రమం ఎక్కడ వున్నదో? ఎంతదూరం ఉన్నదో తెలియడం లేదు. ఈ మహాసాగరం నేను దాటగలనా? తిరిగి రాగలనా? నాకిక్కడే నూకలు ఉన్నాయనుకుంటాను" అన్నాడు.

హంసలు- "యువకుడా! అధైర్యపడకు. దీనికి అవతలివొడ్డునే ఆ ఆశ్రమం వున్నది. నిన్ను మేము దాటిస్తాం, రా!" అన్నాయి. యువకుని ఆనందానికి మేరలేదు.

వెంటనే హంసలు యువకుని సముద్రం దాటించి, "దినకరుని ఆశ్రమం అదిగో, సమీపములోనే వున్నది. ఈ దారినే వెళ్ళు. ఆ దేవుని దర్శనం కాగలదు" అని చెప్పాయి.

యువకుడు హంసలు చూపిన మార్గమునుబట్టి పోతున్నాడు. కొంతదూరం వెళ్ళేసరికి ఒక క్రొత్తవ్యక్తి కనుపించి- "దారిలో ఎక్కడయినా అస్త్ర శస్త్రాలు పడివుండగా చూచావా?" అని అడిగాడు.

యువకుడు- 'ఆ! చూచాను'

'అయితే, వాటిని తాకలేదుగదా?'

"లేదు. అవి నావిగావు. అందుచేత వాటిని ముట్టలేదు."

"అయితే ఎంతో నమ్మకస్తుడవన్నమాట. ఇలా ఎక్కడికి వెడుతున్నావు?"

"సూర్యదేవునివద్దకు వెడుతున్నాను."

క్రొత్తవ్యక్తి- "నాపేరు ఎఱ్ఱచుక్క (వేగుచుక్క)అంటారు. సూర్యదేవుడు మా తండ్రే. తన పని పూర్తిచేసుకుని రాత్రికి ఇంటికి వస్తాడు. అప్పుడు నీవు చూడవచ్చు" అన్నాడు.

కొంతసేపటికి వారిద్దరూ ఆశ్రమం చేరుకున్నారు. అక్కడ సూర్యదేవుని భార్య, వేగుచుక్కతల్లి అయిన చంద్రమా ఆ యువకుని ఎంతో ఆదరముతో పలకరించింది. భోజనంపెట్టింది. ఇంతలో సూర్యదేవుడు తన పగటిపని పూర్తిచేసుకుని ఇంటికి వచ్చాడు. తరువాత ఆయనకు చంద్రమా "ఈ యువకుడు తమతో అత్యవసర కార్యంమీద వచ్చాడ"ని చెప్పింది. వేగుచుక్క "ఇతడెంతో విశ్వాసపాత్రు"డని చెప్పాడు. అది విని సూర్యదేవుడు ఎంతో సంతోషించి యువకునితో- "అబ్బాయి! నీ రాకకు నాకెంతో సంతోషమయింది. నీయిష్టంవొచ్చినన్ని రోజులు ఇక్కడ వుండవచ్చును. వేగుచుక్క నీకు మిత్రుడైనాడు గదా? ఏమీ సంకోచ పడవద్దు" అని అభయమిచ్చాడు.

తరువాత చంద్రమా, యువకునితో "నాయనా! ఈ వేగుచుక్కతో నీవు చూడవలసిన చోట్లన్నీ చూడు. కాని ఒక్కమాట; ఈ జలరాశినుంచి ఇతన్ని కాపాడాలి. దాంట్లో చాలా చెడ్డ పక్షులు వుంటాయి" అని చెప్పింది.

యువకుడు కొంతకాలం పాటు అక్కడే వుండిపోయాడు. ఉన్నంతకాలం వేటలోనూ, ఆటలోను, పాటలోనూ వేగుచుక్కతోటే వుంటుండేవాడు. ఇట్లా తిరుగుతూతిరుగుతూ వుండగా ఒకదినం వేగుచుక్క సాగరతీరాన పక్షులనుచూచి 'నాటిని కొడదాం పద'మన్నాడు.

యువకుడు "వద్దు, వెళ్లవద్దు" అని అడ్డు పెట్టాడు. కాని వేగుచుక్క వినకుండా సముద్రతీరానికి పరుగెత్తాడు. వెంటనే అక్కడి పక్షులు అతణ్ణి పొడవడానికి రాసాగాయి. ఇంటివద్ద చంద్రమా చెప్పినమాటను యువకుడు మరువలేదు. వేగుజుక్కను వెన్నంటేవుండి, పొడవడానికి వచ్చే పక్షుల్ని తన బల్లెంతో పొడిచి చంపి, వేగుజుక్క ప్రాణాలు కాపాడాడు.

ఇంటికి వచ్చిన పిమ్మట యువకుడు చేసిన ఉపకారం సంగతి విని చంద్రమా ఎంతో ఆనందించింది. రాత్రి సూర్యదేవుడు రావడంతోనే ఈ సంగతి విని మరింత సంతోషపడ్డాడు. ఆ ఆనందంలో- "నాయనా! నీవు చేసిన ఉపకారం జీవితంలో మరవలేను. కాబట్టి నీవు కోరిన వరము యిస్తాను. కోరుకో ఏమి కావాలో?" అన్నాడు.

యువకుడు జవాబిస్తూ- ''తమ దయాదృష్టే నాకు కావలసింది. దాని కోసమే యింతదూరం వచ్చాను. నేను పెళ్ళాడదలచుకున్న అమ్మాయి తమ ఆజ్ఞలో వున్నదట. అందుచే తమ అనుమతి కొరకు వచ్చాను. ఆ అమ్మాయి ఇంకా తమ అజ్ఞమీదనే వున్నది. ఎట్టి అధర్మమూ చేయలేదు. ఆమె ఇప్పుడు పెళ్ళాడదలచుకున్నది. కాన తమరు అనుమతిచ్చి, ఆమెను నాకు భార్యగా చేయించమని వేడుకొంటున్నాను'' అని ప్రార్థించాడు.

సూర్యదేవుడు- ''తథాస్తు. ఆ గుణసుందరికి, ఆమె పతి, పుత్ర, పుత్రికలకు దీర్ఘాయువు ప్రాప్తించుగాక! ఇక నీవు వెళ్లవచ్చు'' అని దీవించి, ''వెళ్ళేముందు కాస్త ప్రపంచం చూచి వెళ్ళు. నా వెంటరా! చూపుతాను'' అని అతణ్ణి ఆకాశ మండలానికి తీసుకువెళ్ళి, అక్కడినుంచి భూమండలం చూపించాడు. భూగోళం గుండ్రంగా కనుపించింది.

సూర్యదేవుడు ఇంకా ఇలా అన్నాడు- 'భూమిమీద నివసించేవారికి ఒక సందేశమిస్తాను. తీసుకువెళ్ళు. ''రోగాలతోను, కష్టాలతోనూ బాధలు పడేవారి భార్యలు నన్ను తలచుకుని, నాభర్త బాగుపడినట్లయితే సూర్యభగవానునికి మందిరం కట్టిస్తానని ప్రార్థించమను. వారి ప్రార్థన పవిత్రమయినదయితే నేను మెచ్చుకుని వారి భర్తలను కాపాడుతాను. నీవు నాకు కట్టించే మందిరంకూడా ఆకాశ మండలంలాగానో, భూమండలంలాగానో గుండ్రంగా వుండాలి. ''ఆ! ముందుగా నూరు ఇనుపవూచలతో ఆకాశమండలంలాగానో,భూమండలంలాగానో ఒక ఆకారం నిర్మించు. దానిలో సగభాగం ఎఱ్ఱరంగుతోనూ, సగం భాగం నల్లరంగుతోను పూయించు. అప్పుడు నల్లరంగు భాగం 'రాత్రి' అని, ఎఱ్ఱరంగు భాగం 'పగలు' అని పిలువబడుతాయి.''

ఇలా బోధించిన పిమ్మట, సంజీవి మూలికతో ఆ యువకుని బుగ్గమీది మచ్చ మానిపించి, మాలకాకి ఈకలు రెండు చేతికిచ్చి ''ఆరోగ్యమందిరం కట్టించిన ఆమె భర్త వీటిని తప్పనిసరిగ ధరించవలె''నని చెప్పాడు.

వేగుజుక్క, చంద్రమాలుకూడా యువకునికి ఇంకేమేమో చిత్ర విచిత్ర వస్తువులు కట్టబెట్టారు. యువకుడు వెళ్ళిపోవడానికి ఇష్టంలేక కాబోలు, చంద్రమా కాస్త కంట తడిబెట్టుకుంటూ అతన్ని ఆశీర్వదించింది. సూర్యభగవానుడు దగ్గరదారి- ఆకాశగంగ- చూపాడు. ఆ మార్గం కుండా యువకుడు వూరు చేరుకున్నాడు.

యువకుడు ఇప్పుడు మంచి చీనిచీనాంబరాలతో వైభవంగావున్నాడు. అతని ధనుస్సు, బాణం, డాలు అన్నీ అస్త్రాలూ గొప్పగా వున్నాయి. అయినప్పటికీ గ్రామస్తులు అతణ్ణి గుర్తుపట్టి స్వాగతమిచ్చారు.

యువకుడు తనరాకకోసం ఎదురుచూస్తూవున్న ఆ సాటిలేనిసుందరికి తాను తెచ్చిన మాలకాకి ఈకలు రెండూ ఇచ్చి "సూర్యభగవానుడు, నీమీద ప్రసన్నుడయి ఈకలు పంపాడు" అని చెప్పాడు.

దానికి ఆ అమ్మాయి ఆనందపరవశురాలయినది. యువతీ యువకులకు అతివైభవముగా వివాహము జరిగినది. తరువాత వారు సూర్యదేవునికి తమ కృతజ్ఞత తెలియజేస్తూ అతనిపేరు మీద ఒక ఆరోగ్యమందిరం కట్టించారు. సూర్యభగవానుడు వారికి దీర్ఘాయువు ప్రసాదించాడు.

ఈ విధంగా ఆ యువతీ యువకులు అమరజీవులయినారు.



<u>ఉత్తర రష్యా కథ:</u>

# సోనియా, పన్నెండు మాసాలు

సరోజ హరిభూషణ్

ఉత్తర రష్యాలో ఒక అడవికి దగ్గర ఒక వూరుండేది. ఆ వూరిలో ఒక మనిషి వుండేవాడు. అతనికి ఒకగాను ఒకకూతురు కలిగింది. పేరు'సోనియా'. కొంత కాలానికి ఆపిల్ల తల్లి చనిపోయింది. తండ్రి ఒక విధవామెను పెళ్ళి చేసుకున్నాడు. ఆమెకు ఒక కూతురు పుట్టింది. ఆ కూతురిపేరు ''నతాశా''. తల్లి బిడ్డల స్వభావం చాలాచెడ్డది. పరమదుష్టులు. సోనియాను ఎప్పుడూ బాధపెట్టడమే వారిపని. దినమంతా సోనియాతో ఏదో ఒక పని చేయిస్తుండేవారు. వాళ్ళు మాత్రం పూచికపుల్ల కదిల్చేవారు కాదు. సోనియాకు తినడానికి సరైన అన్నము గానీ, కట్టడానికి సరైన బట్టలుగాని లభించేవిగావు తండ్రి భార్యంటే భయపడే వాడు. అందుచేత అతడు ఆమెను పన్నెత్తిమాటఅనలేక పోయాడు.

ఒక దినం మంచు దట్టంగా కురుస్తున్నది. చలి కూడా తీవ్రంగానే వున్నది. అది శీతాకాలం. సవతితల్లి సోనియాను పిలిచి- "తొందరగా అడవికి వెళ్ళి, "స్ట్రాబెరీ"లను (ఒక రకమైన పండ్లు) యేరుకురా" అని ఆజ్ఞాపించింది.

అది "స్ట్రాబెరీ"లు కాచేకాలం కాదు. అందువల్ల సోనియా- "అమ్మా! ఇది "స్ట్రాబెరీ"ల కాలం కాదు. నేను ఎక్కడినుండి తెచ్చేది?" అన్నది సవతితల్లితో. కాని ఆమాట సవతితల్లి చెవిని బెట్టలేదు. సోనియాకు బుట్ట చేతికిచ్చి బలవంతంగా వెళ్ళమంది.

సోనియా పండ్లకోసం బయలుదేరింది. అది చలికాలం. 'స్ట్రాబెరీ'లు ఎక్కడ దొరుకుతాయి? తిరుగుతూ తిరుగుతూనే ప్రొద్దుగూకిపోయింది. మరీ చీకటిపడితే దారిలో తోడేళ్లభయం. అందుచేత సోనియా సంధ్యవెలుగు వుండగానే ఇల్లుచేరాలని తొందర తొందరగా అడుగులు వేయసాగింది. కాని పాపం, దారితప్పి అడవిలో చిక్కుకుని, అక్కడ ఎవరూ తోడులేక ఏడవసాగింది. ఇంతలో కొంతదూరాన వెలుతురు చూచి కాస్త ధైర్యం తుచ్చుకున్నది.

సోనియా ఆ వెలుతురున్న చోటుకు చేరుకున్నది. అక్కడ పెద్ద మంట మండుతున్నది. దాని చుట్టూ పన్నెండుమంది పెద్ద మనుష్యులు కూచుని చలి కాచుకుంటున్నారు. ఆ అమ్మాయి వారిని సమీపించగానే వారిలో పెద్దతను- "బిడ్డా! నీ వెవరవు? ఎందుకు వచ్చావు?" అని అడిగి, అమ్మాయిని మంట వద్ద



చేతిలో రాజదండము ఉన్నవ్యక్తి "చిట్టి! నీ వెవరవు? ఇక్కడికి ఎందుకొచ్చావు?" అని అడిగి, ఆ అమ్మాయిని మంటవద్ద కూచోబెట్టాడు.

కూచోబెట్టుకున్నాడు. కొంతసేపు ఆగి ఆ అమ్మాయి "నా సవతితల్లికోసం 'స్ట్రాబెరీ'లు వెదకడానికి వచ్చాను" అని తన కథను వివరంగా వినిపించింది.

ఆ పన్నెండు మందీ మామూలు మనుష్యులు కారు. వారే పన్నెండు మాసాలు. అవి ఈ రూపంలో వుంటున్నాయి. వారిలో ఒకని చేతిలో రాజదండ మున్నది. అతని పేరు 'పుష్యమాసము'. అతని రాజ్యమే అప్పుడు నడుస్తున్నది. అమ్మాయి కథ విని, పుష్యమాసము తన చేతి రాజదండము "చైత్రమాసము" చేతిలో పెట్టి "కొంతసేపు నీవు రాజ్యం చెయ్యి?" అన్నాడు. రాజదండం చేయిమారడం తోనే మంచు కరిగిపోయింది. "స్ట్రాబెరీ"లు బైటబడ్డాయి. సోనియా వాటిని బుట్టలో నింపుకుని, వారికి నమస్కారంచేసి ఇల్లు చేరుకున్నది. తరువాత రాజదండం తిరిగి పుష్యమాసం తీసికొన్నాడు.

ఋతువుగాని ఋతువులో సోనియా ఇంతమంచి 'స్ట్రాబెరీ"లు తెచ్చినందుకు సవతితల్లి ఆశ్చర్యపడింది. ఆకాలంలో ఆ పళ్ళు దొరకవని తల్లికి తెలుసును. కాని ఆ వంకమీదైనా సోనియా అడవికి వెడితే అక్కడ ఏ తోడేలన్నా తినేస్తుందని సవతితల్లి ఉద్దేశ్యం. ఆ ఉద్దేశ్యంతోనే పంపింది. కాని అనుకున్నదానికి వ్యతిరేకంగా జరిగినందుకు సవతితల్లి నొచ్చుకున్నది. ఇలా కొన్నిదినాలు గడిచాయి. తల్లీ కూతురూ కలసి మరొక కుట్ర పన్నారు. ఈసారి పొగడపువ్వులు తెమ్మన్నారు. అవి వసంతఋతువులోగాని దొరకవు. అయినా పాపం సోనియాకు వెళ్ళక తప్పిందికాదు. ఏడుస్తూ ఏడుస్తూ అడవిలో యిదివరకు వెళ్ళినచోటుకే వెళ్ళి "ఓ పన్నెండు మాసాల్లారా? దయచేసి పొగడపువ్వు లియ్యరూ?" అని గట్టిగా అరిచింది. పిల్ల పిలుపు వినగానే పన్నెండుమాసాలు మనుష్యరూపంలో వచ్చి నిలబడ్డాయి. 'సంగతేమిట'ని అడిగారు. పిల్ల వచ్చిన సంగతి చెప్పింది. ఈసారి 'పుష్యమాసం' తన రాజదండాన్ని మరల 'చైత్రమాసాని'కిచ్చి "కొంతసేపు నీవు రాజ్యంచేయి" అన్నాడు. రాజదండం చేయి మారేసరికి వసంతఋతువు వచ్చింది. ప్రకృతి కలకలలాడుతూ పొగడపువ్వులతో నిండిపోయింది. సోనియా బుట్టనిండా పువ్వులు నింపుకుని వారికి నమస్కరించి ఇల్లు చేరింది.

ఈసారి సవతితల్లికి మరింత ఆశ్చర్యం కలిగింది. అడవిలో ఈ పిల్లకెవరో సహాయపడుతున్నారని అనుమాన పడింది. ఆ రహస్యం తెలుసుకోవడానికి ఒకనాడు తనకూతురు 'నతాశా'ను అడవికి పంపింది. నతాశా అడవికి వెళ్ళింది. అక్కడ ఆ పన్నెండుమంది కనుపించారు. "నీవు ఎవరవు? ఎందుకు వచ్చావు?" అని అడిగారు. నతాశా ఏదో కొంటిగా జవాబిచ్చింది. దాంతో పుష్యమాసానికి కోపంవచ్చి ఒక్కసారిగా మంచు కురిపించేశాడు. నతాశా ఆ చలికి తట్టుకోలేక చనిపోయింది.

ఎంతసేపటికీ కూతురు 'నతాశా' రాకపోవడంచూచి తల్లి స్వయంగా వెతకడానికి వెళ్ళింది. అడవిలో తిరుగుతూ తిరుగుతూ వుండగా ఒక పెద్దపులి ఆమెను చంపి తినేసింది. ఈవిధంగా 'నతాశా'కు, తల్లికి వారి దుష్టతనానికి తగిన శాస్తి జరిగింది.

సోనియా తన తండ్రి వద్ద సుఖంగా వుంటున్నది. కొంతకాలానికి ఒక రాజకుమారుడు వేటకువచ్చి, తిరుగుతూ, తిరుగుతూ వుండగా అడవిలో పొద్దు పోయింది. అందుచేత ఆ ప్రక్కనున్న గ్రామంలో సోనియా యింటివద్ద ఆ రాత్రి విశ్రమించాడు. తల్లిలేని పిల్ల సోనియా ఆరాత్రి తనకు చేసిన అతిథిసత్కారము, పరిచర్యకు రాజకుమారుడు ఆశ్చర్యపడ్డాడు. ఆమెతెలివితేటలకు మెచ్చుకున్నాడు. ఆఖరికి ఆమెతండ్రి నడిగి రాజకుమారుడు సోనియాను వివాహమాడాడు.

నాటినుంచి వారిద్దరూ సుఖంగా వుంటున్నారు.



